ISSUED ON : 27-10-58.

Vol. XVI
No 5




7th July, 1958
(Monday)

# ANDHRA PRADESH
# LEGISLATIVE ASSEMBLY DEBATES

## OFFICIAL REPORT

### Part II—Proceedings other than Questions and Answers



## CONTENTS

| | PAGES |
|---|---|
| Business of the House ... ... ... | 293—294 |
| Statement re : Hak-e-Malikana ... ... ... | 295—296 |
| Adjournment Motion re : Retrenchment in the Revenue Department of Srikakulam District —Not Allowed ... | 296—297 |
| Amendments to the Andhra Pradesh General Sales Tax Rules —Consideration concluded ... | 298—303 |
| The Madras Land Encroachment (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958 —Referred to Select Committee ... | 303—350 |

# THE
# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY
# DEBATES

[Part II—Proceedings other than Questions and Answers]

## OFFICIAL REPORT

Sixtysixth Day of the Sixth Session of
the Andhra Pradesh Legislative Assembly

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Monday, the 7th July 1958.*

The House met at Ten of the Clock.

[*MR. SPEAKER IN THE CHAIR*]

## QUESTIONS AND ANSWERS

( See Part I )

## Business of the House

*శ్రీ బి.* రామారెడ్డి (మైదుకూరు): Point of Information, Sir, నేషనలిస్టు పార్టీ dissolve అయినట్లు తీర్మానం చేసుకున్నారు. ఆ విషయం మీ నోటీసులోనికి వచ్చిందా ?

మిష్టర్ స్పీకర్ : నాకు వ్రాతమూలకంగా ఏమిరాలేదు. నేషనలిస్టు పార్టీ నాయకుని దగ్గరనుంచి కాని బాధ్యత కలిగిన డిప్యూటీ లీడర్, ఛీఫ్ విప్ వంటి వారెవరినుంచి కాని, మేము ఈపార్టీలోనుంచి చీలిపోయినామని చెప్పే సభ్యుల నుంచి కాని ఎట్టి వ్రాతమూలకమైన సమాచారం నాకు రాలేదు. రానిదే ఏమీ చేయలేను. వచ్చినా రేపటితో సభవాయిదా వేసుకుంటాము. కాబట్టి వచ్చే సమావేశానికి తగుచర్య తీసుకుంటాము.

*శ్రీ ఎన్. వి. వెంగళ్రాయనాయుడు* (వేపంజేరి): పార్టీ శాసన సభ్యులు వ్రాసిఇస్తే తీసుకోవచ్చును కదా !

మిస్టర్ స్పీకర్ : వ్రాసిఇస్తే తీసుకుంటాను.

శ్రీ పి. గున్నయ్య · (పాతపట్నం - రిజర్వుడు) · ముఖ్యమైన విషయం తమ దృష్టికి తెస్తున్నాను. ఈ దినం లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యుల ప్రమాణ స్వీకరణ సందర్భంలో శాసన సభ్యులు visitors గా వెళ్ళినప్పుడు తగిన ఏర్పాట్లు చేయబడ లేదు. మా హక్కులు రక్షించే పూజ్యులు తమరైనందున ఈ మధ్యాహ్నం జరిగే కార్యక్రమంలోనైనా మాకు తగిన వసతులు కలుగచేసి పాల్గొనే అవకాశం కలి గించాలని కోరుతున్నాను.

మిస్టరు స్పీకర్ : ఈ సభలో అయితే సభ్యుల హక్కులను నేను రక్షించ గలను. అక్కడ Chairman గారున్నారు. అక్కడ సర్వాధికారం వారిది. అక్కడ మీతోపాటే నేనుకూడా ఎక్కడ కూర్చోమంటే అక్కడ కూర్చో వలసినదే. అయినా కనుక్కొంటాను. ఈ పూట బహుశా ప్రమాణ స్వీకరణ మాత్రం జరిగి ఉంటుంది. మధ్యాహ్నం అన్ని జరుగుతాయనుకుంటాను. గౌరవ సభ్యులకు అవకాశం లేకపోతే ఎట్లా ?

శ్రీ ఎల్. లక్ష్మణదాసు (పాతపట్నం - జనరల్) : రేపటితో శాసనసభా సమావేశం పూర్తి అవుతుందా ? లేక ఇంకా ఆలస్యం అవుతుందా ?

మిస్టరు స్పీకర్ : అయినంత అవుతుంది. రేపటితో వాయిదా వేస్తామనే అనుకుంటున్నాను.

శ్రీ వి. విశ్వేశ్వరరావు (మైలవరం) : కొన్ని short notice ప్రశ్నలు ఇచ్చాము. రేపటితో సభ వాయిదా పడుతుంది, 10 రోజులనుంచి అవి రాకపోవడం న్యాయంకాదు. వాటిపై ఏమైనా చెబుతారా ?

మిస్టరు స్పీకరు : మంత్రులను అడిగాను, short notice ప్రశ్నలను పూర్తి చేయాలని. వారు తొందరలో ఉన్నారనుకుంటాను. పంపలేదు. ఇపుడు ఏమీ చేయలేను, వ్యవధిలేదు. అయితే short notice ప్రశ్నలకోసమై శాసనసభ సమా వేశాన్ని పొడిగించడం ఉండదు.

I wish to draw the attention of the Press. కె. అంతయ్యగారు అనే శాసనసభ్యులు తాను కమ్యూనిస్టు కానని, Republican Party of India కు సంబంధం ఉన్న Scheduled Castes Federation కు చెందినవాడిని అని, ఆయనను పేపర్లలో కమ్యూనిస్టు అని వ్రాసినారని దానిని దిద్దవలసిందని కోరినారు. ఈ విషయం Press వారి దృష్టికి తెస్తున్నాను. ఎవరైనా ఆ విధంగా వ్రాసి ఉన్నట్లయితే correction ను publish చేయండి.

## Statement Re: Hak-e-Malikana

*శ్రీ సి హెచ్. రాజేశ్వరరావు (చొప్పదండి)* : అధ్యక్షా ! తెలంగాణా ప్రాంతంలో యీ తాటిచెట్టు, యీతచెట్టు మొదటి పన్ను పట్టేదారుకు కొంత వరకు యివ్వడం జరిగింది. గౌరవనీయులైన శ్రీ రంగారెడ్డిగారు మంత్రిగా వున్నప్పుడు పోస్టు ద్వారా గ్రామాలలో రైతులకు అందజేయాలని ఒక నిర్ణయం జరిగింది. తరువాత రైతులే స్వయముగా తహసీలుకు వెళ్ళి తెచ్చుకోవాలని నిర్ణయించారు. కొన్ని కొన్ని అవకతవకలు గ్రామాలలో జరిగినప్పటికీ నూటికి 50 మంది రైతులకు డబ్బు చెందడం జరిగింది పోస్టు ద్వారా గవర్నమెంటు డబ్బు అందజేస్తుందని ఆశించాముగాని అది జరుగలేదు. పోస్టు మాస్టర్లు మనియార్డరు ఫారం యివ్వడం లేదనీ, యిచ్చినా వారి quota కు మించి వున్నవని స్వీకరించడం లేదనీ, ఆ డబ్బు ఆపివేయడం జరిగింది. గతసంవత్సరం కరీంనగరం, నల్లగొండ యితర తెలంగాణా జిల్లాలలో డబ్బు యివ్వక నిలిపి వేయడంవల్ల రైతులు చాలా యిబ్బంది పడుతున్నారు Accountant General నుంచి objection వచ్చిందనీ, అందువల్ల పట్టాదారే తహసీలుకి పోయి రుసుముదారున 3 ఫారములు పూర్తిచేసి యిస్తేనే డబ్బు యిస్తారనీ అన్నారు దానివల్ల ఒకటి రెండు రూపాయలు కోసం తహసీలుకో కలెక్టరాఫీసుకు పోవడానికి ఎక్కువ ఖర్చులై రైతులు నష్టపడుతున్నారు. పదో, ఇరవయ్యో, పఠయ్యో వస్తే కుటుంబ ఖర్చులకు పనికి వస్తాయని రైతులు ఎంతో ఆశపెట్టుకున్నారు. అందుచేత ప్రభుత్వం ఒక స్పష్టమైన విధానాన్ని అవలంబించి రైతులకు యీ డబ్బు అందే టట్లు చేయాలని ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను.

*రివిన్యూ మంత్రి (శ్రీ కె. వెంకటరావు)* : అధ్యక్షా ! హక్కే మాల్ఖానా గురించి యిదివరకు 1957 నవంబరు నెలలో ఒక statement యివ్వడం తటస్తించింది. ఈ గవర్నమెంటు వారి accounts అన్నీ యీ గవర్నమెంటు యొక్క తాబేదారు కాని Accountant General గారు నడిపించాలి. ఈ మనియార్డరు ద్వారా హక్కే మాల్ఖానా పంపించడం వారి యొక్క నిబంధనలకు వ్యతిరేకమనీ ఆ విధముగా జరుపడానికి వీలులేదనీ voucher వ్రాసిచ్చిన తరువాతనే payment జరగాలనే నిర్ణయం వారు తీసుకోవడంవల్ల యిదివరకు పద్ధతిని మళ్లా అమలులో పెట్టడానికి వీలులేకుండా బాధవచ్చింది. ఇన్నాళ్లనుంచీ Finance Department వారికీ, Revenue Department వారికి Accountant General వారికీ మధ్యను correspondence నడుస్తున్నది దాని పర్యవసానం యేమీ తేలలేదు. కాని చాలా రూపాయలు ప్రభుత్వం ట్రెజరీలలో నిలువవుండిపోయి అసలు వారికి చెందకుండా బాధపడుతున్నారనే సంగతి చూచి మొన్న 4-7-58 తేదీని ప్రభుత్వం వారు తుదినిర్ణయం తీసుకునేదాకా Rule 308 of the Hyderabad Treasury

## Amendments to the Andhra Pradesh General Sales Tax Rules.

Notification II.

*Sri Basava Manaiah (Andole)* :- I beg to move :

" For the existing rule (2) of Notification II substitute the following :—

(5) The fees for the grant or renewal of a licence shall, subject to a maximum of Rs. 1,000/-, be as follows :—

| | | |
|---|---|---|
| (i) | Where the turn-over does not exceed Rs. 30,000 | Rs. 20/- |
| (ii) | Where the turn-over exceeds Rs. 30,000 but does not exceed Rs. 40,000 | ,, 33/- |
| (iii) | Where the turn-over exceeds Rs. 40,000 but does not exceed Rs. 50,000 | ,, 47/- |
| (iv) | Where the turn-over exceeds Rs. 50,000 but does not exceed Rs. 60,000 | ,, 59/- |
| (v) | Where the turn-over exceeds Rs. 60,000 but does not exceed Rs. 70,000 | ,, 70/- |
| (vi) | Where the turn-over exceeds Rs. 70,000 but does not exceed Rs. 80,000 | ,, 87/- |

*Mr. Speaker* : Motion moved.

*శ్రీ బసవ మానయ్య* : అధ్యక్షా ! వెయ్యి రూపాయలవరకు లైసెన్సుఫీజు వేసే అధికారాన్ని, అమెండ్ మెంట్ ద్వారా ప్రభుత్వం తీసుకోదలచింది. 30 వేల రూపాయలవరకు టరనోవర్ ఉన్నట్లయితే, ఆ టరనోవర్ మీద 25 రు. లు లైసెన్సు ఫీజు వేయటానికి యీ అమెండ్ మెంట్ ద్వారా అధికారాన్ని ప్రభుత్వం తీసుకొంటున్నది. ఇంతకు ముందే ప్రభుత్వం సేల్స్ టాక్స్ అధికారులకు, ఇన్స్పెక్టర్స్ కు చాలా విశాలమైన అధికారాలు ఇవ్వటం జరిగింది. వారు పెద్ద పెద్ద వ్యాపారస్థుల ఇళ్లలోపలికి వెళ్లి, పుస్తకాలు చూడటానికి అధికారం ఇచ్చింది. గోడౌన్స్ తలుపులు తీయించి ధాన్యం చూసే అధికారం ఇచ్చింది. వారికి వ్యాపారస్థుల ఇళ్లు, గోడౌన్స్ జప్తు చేసే అధికారం ఇచ్చింది. ఇటువంటి చిన్న ఉద్యోగస్థులకు, ఇన్స్పెక్టర్స్ కు పెద్ద వ్యాపారస్థుల ఇళ్లలోకి, గోడౌన్స్ లోకి

పోవటానికి అధికారం ఇవ్వటంవల్ల, వారు తమ అధికారాన్ని దుర్వినియోగము చేసే అవకాశము ఉన్నది. చిన్నచిన్న ఇన్స్పెక్టర్స్‌కు ఆ విధంగా అధికారం ఇస్తే, లంచగొండి విధానము పెరిగిపోతూ ఉంటుంది. ఇంతేగాకుండా, యీనాడు ప్రభుత్వం లైసెన్సు ఫీజు హెచ్చుచేయటం జరిగింది. ఈ నాడు అక్కడ ఉన్న లంచగొండి విధానాన్ని నిర్మూలించటానికి ప్రభుత్వం ఎటువంటి చర్య తీసుకోవటం లేదు. 30 వేల రూపాయలవరకు టరనోవర్ బిజినెస్‌చేసే వారిపై రు. 25 లు లైసెన్సు ఫీజు వేయాలని ప్రభుత్వం అమెండ్‌మెంట్ తీసుకు వచ్చింది. లక్ష రూపాయల టరనోవర్ మీద 125 రు. లు లైసెన్సు ఫీజు వేయాలని ప్రభుత్వం అమెండ్ మెంట్ తీసుకువచ్చింది లక్ష రూపాయల టరనోవర్‌కు 125 రు. లే కాదు, రెండు వేలరూపాయలు లైసెన్సు ఫీజు వేసినా నాకు ఏవిధమైన అభ్యంతరం లేదు. కాని, 20 వేలు, 30 వేలు రు. ల వ్యాపారం చేసే వారిపైన లైసెన్సు ఫీజు వేయకూడదని నా అభిప్రాయము. అటువంటి చిన్నచిన్న వ్యాపారస్తులపై వేసే లైసెన్సు ఫీజును తగ్గించాలనే ఉద్దేశంతో నేను యీ అమెండ్‌మెంటును తీసుకువచ్చాను. 3 వేల రూపాయల టరనోవర్ నుంచి యీ లైసెన్సు ఫీజు పెట్టారు. సాధారణంగా ఒక పల్లెటూరిలో, ఆ ఊరికి కావలసిన చిల్లర సామానులు ఉల్లి, వెల్లుల్లి వగైరా అమ్ముకొనే చిన్న వ్యాపారస్తునికి సంవత్సరానికి 3, 4 వేల రూపాయల టరనోవర్ ఉంటుంది. ఆ 3, 4 వేల రూపాయల వ్యాపారానికి లైసెన్సు ఫీజు కట్టాలంటే, అది న్యాయమైంది కాదు- మనం ఇెనన్సీ యాక్టులో 3,500 రు. ల కంటె, 5,500 రు. లాభం (గరిష్ట ఆదాయం) ఉండాలంటున్నాము. అదేవిధంగా ఆలోచిస్తే, యీ సేల్సుటాక్స్ యాక్టులో 10 వేలవరకు లైసెన్సు ఫీజు లేకుండా చేయవలసి ఉండెను 3 వేల రూపాయల టరనోవర్‌కు 2 వందలు, 3 వందల రూపాయలు లాభం ఉంటుంది. దానికి 25 రు. లు లైసెన్సు ఫీజు వేయటం జరుగుతుంది ఈ లైసెన్సు తీసుకొనేవారు నెలకు, పదిహేను రోజులకు ఆ ప్రిస్క్రైబ్డ్ ఫారమ్స్ నింపి సేల్సుటాక్స్ ఆఫీసర్సుకు పంపవలసి ఉన్నది. ఆ ఫారమ్స్ ఇంగ్లీషు భాషలో ఉంటాయి పల్లెటూళ్లలో ఇంగ్లీషు వచ్చినవారు ఒక్కరుకూడ ఉండరు. కాబట్టి అటువంటి చిన్న వ్యాపారస్తులు ఆ ఫారమ్స్ పూర్తిచేసి పంపించుకునే పరిస్థితిలో ఉండరు. ప్రభుత్వం మూడువేల రూపాయలు టరనోవర్ ఉన్న చిన్నచిన్న వ్యాపారస్థుల మీద లైసెన్సు ఫీజు వేయటం చాలా అన్యాయం. పట్టణాలలో, లక్షల వ్యాపారంచేసే వారిపై లైసెన్సు ఫీజు వేయవచ్చును. వారిపై ఇంకా లైసెన్సు ఫీజు ఎక్కువ చేసినా, వారు ఇచ్చుకోగలరు. లక్ష రూపాయలకంటె ఎక్కువ టరనోవరు ఉన్న వ్యాపారస్తులపై లైసెన్సు ఫీజు తగ్గించమని నేను అమెండ్‌మెంట్ పెట్టలేదు. కాని, పల్లెటూళ్లలో వ్యాపారం చేసుకొనే చిన్నచిన్న వ్యాపారస్తులపై వేసే

లైసెన్సు ఫీజు తగ్గించవలసిందిగా నేను యీ అమెండ్‌మెంటు ఇచ్చాను. అటువంటి చిన్న వ్యాపారస్తులకు అసలు పొట్టగడవటమే కష్టంగా ఉంటుంది. అటువంటి వారిపైన లైసెన్సు ఫీజు వేయటం, యీ ఫారమ్స్ పూర్తిచేసి పంపాలనే బాధ్యత వేయటం చాల అన్యాయం. మూడువేల రూపాయల టరనోవర్ మీద లైసెన్సు ఫీజు అసలే ఉండకూడదని నా యొక్క అభిప్రాయము. ఈ రోజున ప్రభుత్వం సేల్సుటాక్స్ విషయంలోగాని, రైతుకూలీలకు సంబంధించిన విషయంలో కాని, ప్రతి పక్షంనుండి వచ్చే ఏ సూచనను అంగీకరించటానికి సిద్ధంగా లేదు. ప్రభుత్వం సూచించిన 25 రు.ల లైసెన్సు ఫీజును 20 రు.లకు తగ్గించవలసిందిగా నేను సూచించాను. 30 వేలనుండి 40 వేలవరకు ఉన్న టరనోవర్ మీద లైసెన్సు ఫీజు 37 రు లు లైసెన్సు ఫీజుఉండాలని సూచించాను. ఒక్క నాలుగు రూపాయలు తగ్గించమని కోరాను. 40 వేల రూపాయలనుండి, 50 వేలరూపాయలకు మించని టరనోవర్‌కు 50 రు.లు లైసెన్సు ఫీజు అని ప్రభుత్వం చెప్పింది. దానికి 47 రు.లు ఉండాలని నేను సవరణ ఇచ్చాను. ప్రభుత్వం కొంచెమైనా ఉదారత్వం చూపిస్తుందో, లేదో, చూద్దామనే ఉద్దేశంతో 3, 4 రు. తగ్గించమని సవరణ ఇచ్చాను ప్రభుత్వం ఇంతవరకైనా తగ్గించటానికి సిద్ధంగా ఉన్నదా అని అడుగుతున్నాను. 50 వేల రూపాయలనుండి 60 వేల రూపాయలకు మించని టరనోవర్ మీద ప్రభుత్వం 60 రు. లైసెన్సు ఫీజు వేసింది. దానిని నేను 59 రు. లు చేయమని కోరాను. ఒక్క రూపాయి మాత్రమే తగ్గించమని కోరాను. దానివల్ల ప్రభుత్వానికి లక్షల రూపాయల నష్టం వస్తుందని నేను అనుకోవటం లేదు. 70 వేల రూపాయలనుండి 80 వేల రూపాయలకు మించని టరనోవర్ మీద ప్రభుత్వం 87-8-0 లైసెన్సు ఫీజు వేసింది. దానిని నేను 87 రు. లు ఉంచమని సవరణ ఇచ్చాను. ఒక్క ఎనిమిది అణాలు మాత్రమే తగ్గించమని కోరాను. 8 అణాలు అయినా తగ్గించటానికి ప్రభుత్వం సిద్ధంగా ఉన్నదా అని అడుగుతున్నాను. "ప్రతి పక్షం నుంచి కోరబడే ప్రజాసౌకర్యములకు సంబంధించిన విషయాలకు ఒక 8 అణాలు తగ్గించటానికైై ప్రభుత్వం సిద్ధంగా ఉందనే" ప్రభుత్వముయొక్క విశాల భావను చూడటానికి యీ అమెండ్‌మెంట్ ఇవ్వబడింది.

* ఆర్థిక మంత్రి (శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి) : అధ్యక్షా ! శ్రీ బసవమానయ్యగారు మాట్లాడిన ధోరణి చూస్తే ఎదో amendment ఒకటి, వారు మాట్లాడిన విషయము మరొకటిగా ఉన్నది. కాని దీనికి ఒక Background ఉన్నది. General Sales Tax Act లోని 39 వ సెక్షను ప్రకారము రూల్సు చేయటానికి ప్రభుత్వానికి అధికారము ఇవ్వబడింది. ఆ విధముగ రూల్సును తయారుచేసి 14 రోజులపాటు ఇక్కడ Table మీద ఉంచాలి ఆ విధంగా ఉంచిన తరువాత

ఎసెంబ్లీ సభ్యులు ఏవైనా suggestions గాని, amendments గాని సూచిస్తే, అవి carryout అవుతాయి. లేకపోతే అవి వెంటనే effect లోకి వస్తాయి. అదే మాదిరిగ మనము మొట్టమొదట చేసినటువంటి Andhra Pradesh General Sales Tax Act, 1957, 15 వ జూన్ తేదీన అమలులోనికి వచ్చినది. దానిక్రింద రూల్సు frame చేసి Table పైన పెట్టబడినవి. ఇప్పుడు గౌరవసభ్యులు ముఖ్యంగా Leader of the Opposition అనండి, కాంగ్రెసు పార్టీ ఇతర సభ్యులు అనండి, various amendments ఇచ్చారు. అవి ఇచ్చిన తరువాత consider చేయబడినవి. తరువాత యీ House కూడ accept చేసింది, ప్రతిపక్ష సభ్యులు move చేస్తే అప్పటి ప్రభుత్వంలో ఉన్న డాక్టర్ గోపాలరెడ్డిగారు accept చేశారు. అయితే అది ఒక formal amendment. ఆ amendment ఏమిటంటే Tribunal లోని Accountant member యొక్క qualification గురించి. ఆ qualifications ఏమేమిటి ఉండాలి అనేది దానికి ఇచ్చిన amendment కూడ ప్రభుత్వము ఒప్పుకున్నది. దాని తరువాత ఇంకను చాలా amendments ఇవ్వగా, ప్రభుత్వం తరపున, యింకా ఇతరుల తరపున proposals పెట్టారు. మొట్టమొదట అవి అన్నీ consider చేసేముందు ఈ శాఖకు సంబంధించిన మంత్రిగా ఉన్న గోపాలరెడ్డిగారు ఆ amendments ప్రతిపాదించిన సభ్యులు informal గా సమావేశమై అందరు సంప్రదించుకుని దానిమీద ఒక decision తీసుకోవాలి అని అనుకొని, చిట్టచివరికి కొంత చర్చ జరిగిన తరువాత అవిఅన్నీ withdraw చేసుకున్నారు. తరువాత First week of August లో Dr. Gopala Reddi Garu, Leader of the opposition, ఇంకను amendments ఇచ్చిన కొందరు సభ్యులు, ఇతర సభ్యులు అందరు కలుసుకొని ఒక conference జరిపి, అందులో యీ amendments ను గురించి చర్చించిన తరువాత కొన్ని తుదినిర్ణయాలు తీసుకున్నారు. ఆ నిర్ణయముల ప్రకారము అప్పుడు ఆ రూల్సును amend చేయడం, అవి తరువాత అమలులోకి రావడం, ఆ మాదిరిగ చేయడం తటస్థించింది. ఈ విషయము బహుశ బస్వా మానయ్యగారికి తెలియదేమోననుకుంటాను. ఇప్పుడు బస్వా మానయ్యగారు ఇచ్చిన amendment ప్రకారము 11 వ సెక్షనుక్రింద The Commission Agent may exempt himself liability to tax by taking out a licence after paying the prescribed fee. అప్పుడు చేసింది ఏమిటంటే Rule 30 (5) క్రింద ఒక scale fix చేశారు. ఆ scale ఎట్లా ఉన్నదంటే :—

మొదట రు. 25,000 వరకు — 50 రూ. లు.
25,000 నుంచి 50,000 వరకు — 100 రూ. లు.
50,000 నుంచి 1,00,000 వరకు — 200 రూ. లు.

తరువాత 1,00,000 కు పైన అయితే నూరేసి రూపాయలు ఎక్కుతూపోతుంది,

ఇలాంటి పద్ధతిమీద ఆ స్కేలు fix చేశారు. 60 వేల నుంచి లక్ష రూపాయలకు మించకపోతే, ప్రభుత్వం రూల్సు తయారుచేసి తీసుకుని వచ్చారు. దానికి amendments ఇచ్చారు. Amendments ఇచ్చినప్పుడు యీ conference ద్వారా తీసుకున్న నిర్ణయాలు ఏమిటంటే, అందులో చాలా మటుకు tax తగ్గించడమే జరిగింది. అది అట్లా ఉండగా ఇప్పుడు బసవమానయ్యగారు చేసిన ప్రభుత్వముమీద నేరారోపణ అనండి, నిందారోపణ అనండి, అది ఏదైనా అనండి, ప్రభుత్వం దేనికి కూడ ఒప్పుకోదు. ఏ అర్ధరూపాయో benefit చూపెంచుదామని చెప్పినా, ప్రభుత్వం మాత్రము ఒప్పుకోవడం లేదు అనే ఆరోపణకు ఆస్కారము లేదు అని మనవి చేస్తున్నాను. ఎందువల్లనంటే, ఆనాడు informal conference జరిగిన తరువాత Annual turn-over not exceeding Rs. 30,000 కు 25 రూపాయలు వేశారు. అది వరకు 25 వేలకు లోపల annual turn-over ఉంటే 50 రూపాయలు అని ప్రభుత్వం తెచ్చిన amendment ను గురించి informal discussion జరిగిన తరువాత, 30 వేలకు మించకుండ ఉన్న turn-over మీద 25 రూపాయలే అని, secondary scheme అని తగ్గించేటట్లుగా మనకు తెలుతున్నది. తరువాత 'for turn-overs exceeding Rs. 1000' అని ఇదివరకు హైదరాబాదు రూల్సులో ఉన్నట్లుగా వాటిని ఆమోదించారు దానికి కూడ వేరే స్కేలు ఉన్నదనుకోండి.

| | |
|---|---|
| మొదటి 30,000 రు. ల వరకు | — 25 రూపాయలు |
| 30,000 నుంచి 40,000 వరకు | — 37-8-0 |
| 40,000 ల నుంచి 50,000 ల వరకు | — 50-0-0 |
| 50,000 ల నుంచి 60,000 ల వరకు | — 62-0-0 |

ఈ విధముగ స్కేలు ఉన్నది. ఆ స్కేలు ప్రకారము ఇప్పుడు మనము అమలుపరుస్తున్నాము కాబట్టి బసవ మానయ్యగారు ఇచ్చిన amendments అర్థ రహితముగా ఉన్నవి. అందువల్ల యిప్పుడు ఎసెంబ్లీ టైము అంతా వృథాపుచ్చుతున్నారేమోనని అనుకుంటున్నాను.

*Mr. Speaker*: The Question is:

For the existing rule (2) of Notification — II SUBSTITUTE the following:

"(5) The fees for the grant or renewal of a licence shall, subject to a maximum of Rs. 1,000 be as follows:—

i. Where the turn-over does not exceed Rs. 30,000. Rs. 20

| | | |
|---|---|---|
| ii. | Where the turn-over exceeds Rs 30,000 but does not exeeed Rs. 40,000. | Rs. 33 |
| iii. | Where the turn-over exceeds Rs. 40,000 but does not exceed Rs. 50,000. | Rs. 47 |
| iv. | Where the turn-over exceeds Rs. 50,000 but does not exceed Rs. 60,000. | Rs. 59 |
| v. | Where the turn-over exceeds Rs. 60,000 but does not exceed Rs. 70,000. | Rs. 70 |
| vi. | Where the turn-over exceeds Rs. 70,000 but does not exceed Rs. 80,000. | Rs. 87" |

The Motion was negatived.

[ *Mr. Deputy Speaker in the Chair* ]

## The Madras Land Encroachment (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958.

Sri *K. Venkata Rao*: Mr. Speaker, Sir, I beg to introduce the Madras Land Encroachment (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958 and move that the Bill be read a first time.

*Mr. Deputy Speaker*: Motion moved.

*శ్రీ కె. వెంకటరావు*: Madras Land Encroachment Act అనేది 1905 వ సంవత్సరములో ఒక ప్రత్యేకమైన శాసనము క్రింద తయారుచేయబడింది. Hyderabad Land Revenue Act లో encroachments కు సంబంధించినటువంటివి కొన్ని సెక్షన్సు ఉన్నవి. దీనికి ప్రత్యేకంగా వేరే యాక్టు ఏమీ లేదు. ఈ రెంటిని సమన్వయపరచి యిప్పుడు యీ బిల్లును తీసుకొనిరావడమైంది. Madras Act లో 16 సెక్షన్సు ఉన్నవి. ఇందులో Sec. 2 లో government property అంటే ఏమిటో యీ చట్టము క్రింద వివరింపబడింది. ఆయాక్టు యిప్పుడు ఇక్కడ సభ్యుల చేతులలో లేదు గనుక ఆ సెక్షనును చదివి వినిపించుచున్నాను.

Section 2 of the Madras Land Encroachment Act, 1905 :—

"(1) All public roads, streets, lanes and paths, the bridges, ditches, dikes and fences, on or beside the same, the bed of the sea and of harbours and creeks below high water mark, and of rivers, streams, nalas, lakes and tanks, and all canals and watercourses, and all standing and flowing water, and all lands, wherever situated, save in so far as the same are the property —

(a) of any zamindar, poligar, mittadar, jagirdar, shrotriemdar or inamdar or any person claiming through or holding under any of them, or;

(b) of any person paying shist, Kattubadi, jodi, poruppu or quit-rent to any of the aforesaid persons, or;

(c) of any person holding under ryotwari tenure, including that of a janmi in Malabar, or of a wargdar in South Canara, or in any way subject to the payment of land-revenue direct to Goverment, or;

(d) of any other registered holder of land in proprietory right, or;

(e) of any other person holding land under grant from the Government otherwise than by way of licence,

and as to lands, save also in so far as they are temple site or owned as house-site or backyard,

are and are hereby declared to be the property of Government except as may be otherwise provided by any law for the time being in force, subject always to all rights of

way and other pubic rights and to the natural and easement rights of other land-owners, and to all customary rights legally subsisting.

(2) All public roads and streets vested in any local authority shall, for the purposes of this Act, be deemed to be the property of Government.

*Explanation* :— In this section 'high water mark' means the highest point reached by ordinary spring-tides at any season of the year."

ఇది గవర్న మెంటు property అని ఆ Act లోనే వ్రాయబడి ఉన్నది. దీనికి సంబంధించే ఈ Act వర్తిస్తుంది. ఇలాంటి భూములను ఎవరైన అధికారం లేకుండా ఆక్రమించినట్లయితే ఆ వ్యక్తి assessment pay చేయాలి అంటే land revenue యివ్వాలన్న మాట. ఇంతే కాకుండా వారి మీద penalty వేయ వచ్చు. తక్షణమే వారిని అక్కడ నుంచి పంపివేయవచ్చు. ఇది దీనిలో ఉన్నటు వంటి వ్యవహారం. ఇప్పుడు ఈ Act ను అనువర్తింపచేస్తూ కొన్ని సవరణలు తీసుకురావడమైనది. ముఖ్యమైనటువంటి సవరణ 5 వ clause కు ఈ 5 వ క్లాజు Madras Act లో 3 వ section క్రింద ఉన్నది. దీనిలో రెండు categories ఉన్నాయి. రోడ్డు మార్జిన్లు, లంకలు. ఈ రెండింటిని ఆక్రమణకు వదలిపెట్టకుండా వేలమయినా వేస్తారు, లేక తాత్కాలిక లైసెన్సు యిచ్చి సాగుకైనా యిస్తారు. ఇల్లా యిచ్చినప్పుడు వసూలైన దానిని rental అనిగాని, fees అనిగాని అంటారు. ఈ rental or fees మామూలు assesment కంటే చాల ఎక్కువగా ఉంటాయి. ఉదాహరణకు, లంకను వేలంపాటలో పెట్టినప్పుడు ఎకరానికి వందరూపాయలు, రెండు వందల రూపాయలు, మూడు వందల రూపాయలు వస్తుంది. కాని దాని మీదే పన్ను 11 రూపాయలకు మించి ఉండదు. దానివల్ల ఎవరైన ఆక్రమణచేసి నప్పటికి వారిమీద assessment వేయవలసి వస్తోందే గాని fees గాని, rental గాని వేసే అధికారం ఇప్పుడున్న 3 వ Section ప్రకారం ప్రభుత్వానికి లేదు. దీనివల్ల జరిగే అన్యాయం ఏమిటంటే– ఎవరైన unauthorised గా లంకలను ఆక్రమించుకుంటే వారు ఎకరానికి 11 రూపాయలు చొప్పున యివ్వడం, వేలం పాటలో పాడుకున్నటువంటి వారు ఎకరానికి 300 రూపాయలో, 200 రూపా యలో చెల్లించడం జరుగుతోంది. ఇది anomaly. దీనిని దిద్దడం కోసం clause 5 లో మార్పు తీసుకురావడానికి అధికారాన్ని తీసుకోవడమైనది. తరువాత clause 6 consequential benifit. 7 వ clause ప్రకారం ఫలానా భూమి

ఆక్రమణ అని చెప్పి వారిమీద పన్ను విధించే అధికారం తహసీల్దారుకు ఉన్నది. కాని అక్కడనుంచి తొలగించడానికి గాని, అక్కడ ఉన్నటువంటి పంటను గవర్నమెంటువారు వశంచేసుకునేందుకు గాని ఇప్పుడున్నటువంటి శాసనంలో అధికారం లేదు. ఈవిధంగా కొంతఅధికారంఉండి,కొంతఅధికారం లేకపోవడంవల్ల వ్యవహారం అంతా ఆలస్యం అవుతోంది. దీనివల్ల eviction చేసేటటువంటి అధికారం R.D.O. తో పాటు తాసిల్దారుకు కూడా యివ్వడం జరుగుతుంది. ఇంకో విషయం కూడా గుర్తించవలసిందని కోరుతున్నాను. Power to arrest the encroaches అని కూడా ఈ clause లో ఉన్నది. అది సాధారణంగా ఉపయోగంలో లేదు. ఈ అధికారాన్ని మాత్రం తాసిల్దారుకు యివ్వడం లేదు. ఈ అధికారం యిక ముందు కూడా R. D. O. కే ఉంటుంది. ఇంతవరకు Land Encroachment Act క్రింద వచ్చినటువంటి విచారణలన్నింటికి తుది నిర్ణయంచేసే అధికారం Revenue Board కు ఉన్నది. మధ్య మధ్యన మనమిత్రులు ఏవో కొన్ని అన్యాయాలు జరుగుతున్నాయని సూచిస్తున్నారు. అందువల్ల దీనికి సంబంధించినటువంటి కాగితాలను తెప్పించుకొని, వాటిని విచారణచేసి తగినటువంటి ఉత్తరువులు జారీచేసే అధికారం ప్రభుత్వమే తీసుకున్నది. Clause 11 లో కోర్టులకు ఉన్న jurisdiction rentals కు, fees కు కూడా విస్తృతం చేయబడుతోంది. Clause 12 లో, వచ్చిన అనుమానాలన్నీ తీర్చేటటువంటి అధికారం గవర్నమెంటువారే తీసుకుంటున్నారు. కాని ఈ అధికారం మూడు సంవత్సరాల వరకే పరిమితం చేయబడుతుంది. దాని తరువాత ప్రభుత్వం మళ్ళీ ఎటువంటి అధికారం చెలాయించడానికీ వీలు ఉండదు. ఇప్పుడు తమ ముందర పెట్టినటువంటి 7 వ నంబరు బిల్లులో ఉన్నటువంటి ప్రధానమైన అవసరాలు యివి. ఈ బిల్లును విచారణలోకి తీసుకుని pass చేయవలసిందని నేను సభ వారిని కోరుతున్నాను.

*Sri. B. Yella Reddy* : (Buggaram) I beg to move :

"That the Bill be circulated for the purpose of eliciting public opinion."

*Mr. Deputy Speaker* : Motion moved.

శ్రీ బి. ఎల్లారెడ్డి : : అధ్యక్షా ! ఇప్పుడు మనముందు ప్రవేశపెట్టినటువంటి ఈ బిల్లు తెలంగాణాకు సంబంధించినంత వరకు చాల ముఖ్యమైన మార్పులనే సూచిస్తుంది. ఇంతవరకు తెలంగాణాలో అమలులో ఉన్నదాని

కంటె ఇది కొన్ని విషయాలలో చాల భిన్నంగా ఉంది. అందువల్ల దీనిని మనం చాల జాగ్రత్తగా పరిశీలించవలసి ఉంటుంది. Madras Act ప్రకారం కలెక్టరుకు Judicial powers ఉన్నాయి. తెలంగాణాలో ఆ powers లేవు. ఇప్పుడు అక్కడ కలెక్టరుకు ఉన్నటువంటి judicial powers ఇక్కడ కూడా వర్తింప చేస్తున్నారు. తెలంగాణాకు సంబంధించినంతవరకు అది చాల ముఖ్యమైనటువంటి పని. అది ఇక్కడ అనుభవంలో లేదు. చాల కఠినమైనటువంటిదిగా తెలంగాణా ప్రజానీకం భావించకతప్పదు. అందుచేతనే మనం దీనిని చాల జాగ్రత్తగా పరిశీలించవలసి ఉంటుంది Penalties విషయంలో కూడా దానికి దీనికి చాల తేడా ఉంటుంది. ఆంధ్రలో అమలులో ఉన్నటువంటి Encroachment Act లో ఒకటి నుంచి ఇరవై రెట్ల వరకు వేయవచ్చు. కాని తెలంగాణాలో అమలులో ఉన్నటువంటి Hyderabad Act లో 10 రెట్లకంటె మించి వేయడానికి ఏస్థితిలోను వీలులేదు. ఆ విషయంలో చాల గొప్ప తేడా ఉన్నది. ఈ రెండింటిని కూడా తెలంగాణాకు వర్తింప చేసినప్పుడు అది ప్రజానీకానికి చాల దారుణంగాను, కఠినమైనదిగాను ఉంటుందని నేను మనవి చేయదలచుకున్నాను. ఇంత తీవ్రమైనటువంటి మార్పులను ఈ విధంగా యింత తొందరగా తీసుకొచ్చి Extension Law అని చెప్పి Extension Bill రూపంలో పెట్టడం ఏ మాత్రం సమంజసంగా లేదు. Integration అంటే ఈ విధంగా Integration of Laws చేయవలసినదే. ఆ ప్రాంతాన్ని, ఈ ప్రాంతాన్ని కలుపుతూ Laws integrate చేయడం అవసరమే. అందులో ఏమి సందేహం లేదు. అందరం కూడా ఆ విషయంలో ఏకీభవిస్తాము. దీనిలో పెద్ద తీవ్రమైనటువంటి మార్పులు ఏమిలేవు. అక్కడి విషయాలు, ఇక్కడి విషయాలు identical గా సమానంగానే ఉన్నాయి. పెద్ద తేడాలు ఏమి లేవు. కాబట్టి formal గా అక్కడ ఉన్నటువంటి చట్టాన్ని ఈ విధంగా తెలంగాణాకు అనువర్తింపచేస్తూ ఈ బిల్లు తీసుకువస్తే సరిపోతుందని మంత్రిగారు భావించడం చాలపొరపాటు అని నేను వారికి మీ ద్వారా మనవిచేయదలచుకున్నాను.

ఇది ఆంధ్ర ప్రాంతానికి సంబంధించినంతవరకూ ఇదివరకునుంచీ అమలులో ఉన్నది కనుక వారికి కొత్తగా కనిపించకపోవచ్చును. ఇదివరకు తెలంగాణాలో ఇటువంటి చట్టాలు లేవు. ఇప్పుడు యిది తీవ్రమైన మార్పులను సూచిస్తోంది. ఈ విషయం మంత్రిగారు గుర్తించవలసి యుండెను. ప్రతిపక్ష సభ్యులను, తెలంగాణా సభ్యులను ఆంధ్రనుంచి వచ్చిన సభ్యులను...వీరందరినీ సమావేశపరచి, వారిముందుకు ఈ విషయం తీసుకువచ్చి, ఏ విధంగా చేస్తే బాగుంటుంది అని ఆలోచించి చేసినట్లయితే చాలా సమంజసంగా ఉండేది. ఇప్పుడు ఎక్కువ చర్చ

లేకుండానే సమరసభావంతో అంగీకరించడానికి అవకాశం ఉండేది. కాని, అట్లా కాకుండా, కేవలం extension రూపంలో ఈ బిల్లును ప్రతిపాదించడం చాలా శోచనీయమైన విషయం. తెలంగాణాలో ప్రభుత్వానికి సంబంధించిన భూములను లావునీ భూములు అంటూంటాము. ఇక్కడ లావునీ భూములు, లావునీ సమస్యలు ఉన్నాయి. ఈ భూములకు సంబంధించి 10, 12 సంవత్సరాలనుంచీ ఒక చరిత్ర ఉన్నది. ప్రజానీకం పెద్ద ఆందోళన చేసినది. నైజాం ప్రభుత్వకాలంలో, నైజాముకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో ప్రజానీకం అంతా పాల్గొన్నది. ఆ సమయంలో కాంగ్రెసు పార్టీవారు,... ఇతర అన్ని పార్టీలవారూ కూడా ఆ ప్రజానీకానికి ఒక విధమైన హామీ ఇవ్వడం జరిగింది భూములు లేనివారికి భూములు ఇస్తాము, వాటిని పట్టాలుగా చేయిస్తాము, ఆ భూములు ఇక ఆ ప్రజలకే సంక్రమింప చేసేటట్లు చేస్తాముఅని అన్నిపార్టీలవారుకూడా హామీ ఇచ్చారు. కాంగ్రెసు, సోషలిస్టు, ప్రజాసోషలిస్టు అన్ని పార్టీలవారూ ప్రజలకు హామీ ఇచ్చారు. .Police action జరిగిన తరువాత, కాంగ్రెసు ప్రభుత్వాలు ఏర్పడిన తరువాత advisors పరిపాలన ఉన్నదనుకోండి. ఆ కాలంలో ప్రజలకు భూముల దాహం బయలు దేరింది. అప్పుడు అన్ని పార్టీలవారూ వారికి హామీఇచ్చారు. ఆ తరువాత ఇంకొక సారి కూడా అటువంటి హామీయే ఇచ్చారు. మొదటి general elections సమయంలో, వారివారి ఉపన్యాసాలలో కాంగ్రెసు వారితోసహా అన్ని పార్టీలవారూ యీ హామీ ఇచ్చారు. ఒక్క హామీ ఇవ్వడమే కాదు, ప్రజలను ప్రోద్బలపరచినారు. "మీరు భూములు దున్నుకోండి, సాగుచేసుకోండి, ఎన్నికలు అయిపోయిన తరువాత మేము ప్రయత్నంచేసి పట్టాలు చేయిస్తాము" అని చెప్పారు.

ఎన్నికలు అయిపోయి, కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడినాక, ఆ సమస్యను తిరిగి తీసుకోవడం జరిగింది. చాలాచోట్ల కాంగ్రెసు ప్రభుత్వాలు ఏర్పడినాయికదా యని, ఇదివరకు కాంగ్రెసువారిచ్చిన హామీలను దృష్టిలో పెట్టుకొని, ప్రజలంతా భూములను ఆక్రమించుకొని, సాగు చేసుకుంటున్నారు. కాని, కొంతకాలానికి అనుమతిలేకుండా సాగుచేస్తున్నారనే నెపంతో వారిపై (తమ తాఖీదులు) penalties వేసి, భూములనుంచి వారిని తొలగించడానికి ప్రభుత్వం ఒక order జారీచేసింది. హైదరాబాదు రాష్ట్రం అంతటా పెద్ద ఆందోళన బయలుదేరింది. తాలూకాలలోనూ, జిల్లాలలోనూ, హైదరాబాదు అసెంబ్లీలోనూ కూడా తీవ్రమైన ఆందోళనలు సాగినాయి. ఆ ఆందోళనలను ప్రభుత్వం గుర్తించి ఒక నిర్ణయం తీసికోవడం జరిగింది. అటువంటి భూములకు పట్టాలు ఇస్తామని అసెంబ్లీలోకూడా ఒప్పుకున్నారు. బయటకూడా అనేక సందర్భాలలో చెప్పారు. ఆ తరువాత రెవిన్యూ డిపార్టుమెంటుద్వారా వివిధ కాలాలలో వివిధ సర్క్యులర్సు జారీచేశారు. వాటిలో

ఈ విధంగా దున్నుకొనే భూములనన్నిటినీ పట్టాలు చేస్తామని స్పష్టంగా చెప్పారు. అప్పటినుంచి ఇప్పటివరకూ— ఎంతోకాలం జరిగిపోయినప్పటికీ— అట్లా సాగు చేసుకొంటున్న భూములకు పట్టాలు ఇవ్వడం జరుగనేలేదు. కొద్ది భూములకు పట్టాలిచ్చారేమో, కాని ఎక్కువ భాగం పరిష్కరింపబడకుండా అట్లాగే ఉండి పోయింది ఇటువంటి పరిస్థితిలో ఆంధ్ర చట్టాన్ని ఈ బిల్లుద్వారా ఈ ప్రాంతానికి వర్తింపచేయడానికి పూనుకొంటే, జరిగేది ఏమిటి? ఇదివరకునుంచీ సాగుచేసుకొంటున్నవారి పరిస్థితి ఏమికావాలి? కాంగ్రెసు పార్టీగాని, మిగతా పార్టీలుగాని వారికి ఇచ్చిన హామీలు ఏమికావాలి? ఈ చట్టాన్ని ఇక్కడకూడా వర్తింపజేసినట్లయితే, వారిని వెంటనే ఆ భూములనుంచి తొలగించడానికి ఆస్కారం ఏర్పడుతుంది. ఇదివరకు judicial powers లేవు. 'భూములను వదలి వెళ్లిపోవాలి' అని నోటీసు ఇస్తారు. ఇప్పుడు అట్లా నోటీసు ఇచ్చినతరువాత వదలి వెళ్లకపోయినట్లయితే, వారిని arrest చేసి నెల రోజులవరకూ కస్టడీలో ఉంచడానికి ఈ బిల్లు అధికారం ఇస్తున్నది. అంతేకాదు. Jail కు పంపించే అధికారంకూడా కల్గుతున్నది. కస్టడీలో పెట్టుకోడానికీ, కోర్టులకు పంపించడానికీకూడా ఈ బిల్లు అధికారం కలుగజేస్తోంది. తెలంగాణాలో ఇదివరకెప్పుడూ ఇటువంటి చట్టంలేదు. రెవెన్యూ డిపార్టుమెంటుకు ఇటువంటి తీవ్రమైన judicial powers లేవు. Judiciary, Executive Powers రెండూ కలిసిఉన్న కాలంలో ఇటువంటి అధికారాలుండేవి. కాని, హైదరాబాదు రాష్ట్రంలో judicial powers ను executive నుంచి విడదీసి చాలాకాలం అయింది. Criminal powers జైలుకు పంపించే అధికారాలూ ఇక్కడ రెవిన్యూ డిపార్టుమెంటుకు లేవు. ప్రభుత్వ భూములను సాగుచేసుకొంటున్న వారి విషయంలో ప్రభుత్వానికి ఉన్న అధికారాలే హైదరాబాదు రెవిన్యూ చట్టం ప్రకారం రెవిన్యూ డిపార్టుమెంటుకు ఉంటాయి. Section 5 లో చూచినట్లయితే తెలుస్తుంది. అందువల్ల తెలంగాణాకు సంబంధించినంతవరకూ, ఇది చాలా తీవ్రమైన మార్పులను సూచించే బిల్లు అని మంత్రిగారు గ్రహించవలసి ఉంటుంది. కాబట్టి నేను దీనిని పూర్తిగా వ్యతిరేకిస్తున్నాను. తెలంగాణాకు సంబంధించినంతవరకూ ఇది సరైనదికాదు. సమరీఖాలులు చేసి జైలుకు పంపించడం, కస్టడీలో పెట్టడం ఇటువంటివన్నీ చాలా పాతకాలంనాటి పద్ధతులని మనవిచేస్తున్నాను.

(Mr. Speaker in the Chair)

ఈ పద్ధతి 60 సంవత్సరాల క్రిందట అమలులో ఉండేవి. అప్పటి పరిస్థితు అనుబట్టి అది సరైనదిగా ఉండేదేమో కాని, దానిని ఇప్పుడు ఇక్కడ వర్తింప చేయడానికి పూనుకోవడం భావ్యం కాదని నేను మనవిచేస్తున్నాను.

ఇప్పుడు కళా వెంకట్రావుగారు మాట్లాడుతూ, జ్యుడిషియరీ అధికారం దీనిలో ఉన్నప్పటికి ఎప్పుడుకూడ దానిని అమలు జరుపలేదని మనవిచేశారు.

అయితే చాలా సంతోషకరమైన విషయం. అది అమలు జరుపకపోయినప్పుడు ఎందుకు ఉండాలి? అమలు జరుపవలసిన అవసరంలేదని వారు అంగీకరించారు. అటువంటి అవసరంలేనప్పుడు తీవ్రమైన, చాలా కాఠిన్యమైన స్వభావం కలిగిన, దానిని తొలగించడానికి పూనుకోవలసియున్నది. లేకపోతే న్యాయం కలుగదని మనవి చేస్తున్నాను. అసలు హైదరాబాదు చట్టంలో ఉన్నటువంటి పెనాలిటీస్ చాలా ఎక్కువగా ఉన్నవని ప్రజలు భావిస్తూ ఆందోళన చేయడం, కాంగ్రెస్ పార్టీతో సహా, అన్ని పార్టీలవారు మంత్రిగారిదగ్గరకు వెళ్లి మొరపెట్టుకోవడం, మంత్రిగారు వాటిని తగ్గించడానికి ఆర్డర్సు జారీచేయడం, ఇదంతా ప్రతి సంవత్సరం జరుగుతున్న విషయమే ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకొన్నట్లయితే హైదరాబాదు చట్టంలో ఉన్నదే ఎక్కువగా ఉన్నది కాబట్టి దానిని తగ్గించడానికి బదులు, అక్కడ ఉన్నటువంటి 20 రెట్ల ప్రొవిజన్ యిక్కడకుకూడ వర్తింపచేయడం జరిగింది. ఇది చాలా కాఠిన్యమైన విషయమని మనవి చేస్తున్నాను. అసలు రెండు నుంచి మూడు రెట్లవరకు పెట్టవలసి ఉండేది అంతకన్నా ఎక్కువరెట్లు పెట్టు కొంటే చాలా అన్యాయం జరుగుతుంది అసలు భూములులేనివారికి ఆధారం లేకుండాపోతుంది వారు పండించిన పంట ఈ పెనాలిటీలు కట్టడానికే సరిపోతుంది. తెలంగాణాలోనూ, ఇతర ప్రాంతాలలోను కూడ దీనినిగురించి చాలా ఆందోళన చెందుతున్నారు. కాబట్టి ఈ విషయాన్ని మంత్రిగారు అంగీకరించ వలసిందిగా కోరుతున్నాను. ఈ బిల్లులో ఉన్నటువంటి అసలు యిన్ని రెట్లు అనేది తగ్గించడానికి, యింకా కొన్నింటికి సవరణలు ప్రతిపాదించాను. అసలు చట్టానికికూడ సవరణలు ప్రతిపాదించాను ఈ సవరణలను మంత్రిగారు అంగీకరించాలని కోరుతూ విరమిస్తున్నాను.

* శ్రీ జి. యల్లమందారెడ్డి (కనిగిరి): అధ్యక్షా! ఈ బిల్లును ప్రజాభిప్రాయానికి పంపాలని, అది కాకపోతే కనీసం సెలక్టు కమిటీకి పంపాలని నేను సవరణ యిచ్చి ఉన్నాను. ఇది చాలా ముఖ్యమైన బిల్లు. ఇంతకుముందే శ్రీ ఎల్లారెడ్డిగారు దానినిగురించి వివరించారు. ముఖ్యంగా ఈ ఎంక్రోచ్‌మెంటు అనేది, శివాయి జమేదార్లుగా సాగుచేస్తున్న వారికి సంబంధించినటువంటి చట్టం. దీనివల్ల తెలంగాణాలో పెద్ద యెత్తున నష్టం వచ్చిందని విశదం అయింది. శివాయి జమేదార్లుగా ఈ Act ప్రకారం బంజర్లు సాగుచేస్తున్న వారికి, రైతాంగానికి, వ్యవసాయ కూలీలకు అనేక యిబ్బందులు ఉన్నాయి. ఈ రోజున మంత్రిగారు దీనిని యింకా బిగించి, వివిధ రూపాలలో సవరణలు ప్రతిపాదించడం చాలా దారుణమైన విషయమని నేను మనవిచేస్తున్నాను. ఒక వైపున, భూములు పేద ప్రజలకు యివ్వాలనే ఆశయముండి. రెండవవైపున ఆహార సమస్య క్లిష్టంగా ఉంది.

కాబట్టి సాగుచేయాలని అంటూ, ఇంతవరకు సాగుచేస్తున్నటువంటి వ్యవసాయదారులను భూములనుంచి వెళ్లగొట్టడానికి కావలసిన అధికారాన్ని జాస్తిగా తీసుకోవడానికి ప్రభుత్వం ప్రయత్నించడం జరుగుతోంది. ఇది ఆంధ్ర ప్రదేశంలో ఉన్న శివాయి జమాదార్లకు పెద్దపోటులాంటిది. దీనివల్ల తెలంగాణాలో చాలా విపరీతమైన పరిణామాలు ఏర్పడుతున్నవని నేను మనవి చేస్తున్నాను ఇంతవరకు ఉన్నటువంటి వ్యవహారాన్ని చూచినట్లయితే తెలంగాణాలోగాని, ఆంధ్రలోగాని కలక్టర్ కే ఎవిక్షన్ చేయడానికి అధికారాలు ఉన్నాయి. ఇప్పుడు ప్రతి తాలూకాలో ఉన్న తహశీల్దార్ కు ఎవిక్షన్ చేయడానికి అధికారాలు యిచ్చారు ఇంతవరకు ఆంధ్ర ప్రాంతంలో సాగుచేస్తున్నటువంటి భూములమీద, ఫలితాలను అనుభవిస్తున్న అనేక వ్యవసాయకూలీలను బలవంతముగా వెనువెంటనే ఎవిక్షన్ చేయడానికి ప్రతిపాదన ఒకటి ఈనాడు రెవిన్యూ మంత్రిగారు మనముందు పెట్టినారని నేను మనవిచేస్తున్నాను. ఎందువల్లనంటే అనేక సందర్భాలలో, చెరువుకు పై భాగంలో సాగుచేస్తున్నారని, బంజర్లు సాగుచేస్తున్నారని పెనాలిటీస్ వేస్తే బ్రతికే దానికి ఏమీలేనందున ఆ పెనాలిటీస్ చెల్లించుకొంటూ, ఆ భూమిపైనే ఆధారపడుతూ ఉన్నవారు ఉన్నారు. కలెక్టరుగారు ఎవిక్టు చేయాలంటె చాలా ఆలస్యం అవుతోంది. అందుచేత ఆంధ్రప్రదేశ్ లో, ఉన్నపాళంగా వీరందర్నీ తొలగించడానికి అధికారాలు, ప్రజలదగ్గరనుంచి, తహశ్శీల్దార్ కు యివ్వడం ఏమాత్రం సమంజసంకాదు. ఈనాడు తెలంగాణ చట్టంలో యింతకంటే మంచిగా ఉన్నప్పుడు, ఆంధ్రప్రాంతంనుంచే అన్నీకూడా, మదరాసు ఆక్టులు, యిక్కడ ఎందుకు అనువర్తింపచేయాలి అన్నదికూడ దురూహ్యంగా ఉన్నది. తెలంగాణాచట్టాన్ని ఆంధ్రకు ఎందుకు వర్తింపచేయకూడదు. తెలంగాణా Act లో చాలా మంచిఉన్నది. అందువల్ల రెవిన్యూ మంత్రిగారు ఈ చట్టాలు అన్నిటిని సమన్వయం చేసే వ్యవహారంలో సాధ్యమైనంతవరకు ప్రజలకు వ్యతిరేకంగా ఉండే ప్రోవిజన్సును అనువర్తింపచేయడానికి, ప్రయత్నిస్తున్నారనే సందేహం లేకుండా చూడవలసియున్నది. తెలంగాణాలో 10 రెట్లు పెనాలిటీలు ఉంటే, ఆంధ్రప్రాంతంలో 20 రెట్లు పెనాలిటీలు ఉన్నాయి. ఇప్పుడు ఆంధ్రప్రాంతంలో ఎవరైనా ఒక పేద ఒక నెంబరులో మాగాణి బంజరును సాగుచేసినట్లయితే, కలెక్టరు ఆ మొత్తం నెంబరు భూమికి అంతకు పెనాలిటీ విధించడానికి హక్కు ఉన్నది. అతను ఆ భూమి అంతా సాగు చేయకపోయినప్పటికి కూడ అతనిపై శిస్తు విధించేహక్కు కలెక్టరుగారికి ఉంది. కాని తెలంగాణా ప్రాంతంలో ఆ పరిస్థితిలేదని నా అభిప్రాయం. అంతేకాకుండా లంకలను తీసుకున్నట్లయితే, దానిమీద అసెస్ మెంటు వేయడమేకాకుండా, దాని ప్రక్కనున్న భూములను లీజుకు యిచ్చినట్లయితే ఎంత వస్తుందో, అదేమొత్తాన్ని దీనిపై తీసుకోవాలి అనడం సమంజసంకాదు. అధ్యక్షా! ఈ లంకలకు సంబంధిం

చిన వ్యవహారమంతా మీకు తెలుసు. అనేక సంవత్సరాలనుంచి సాగుచేస్తున్నటువంటి కూలీలు స్పెసిఫిక్ పెట్టుకొన్నప్పటికి కూడ, వారందరికి ఆ లంకలులేకుండా చేయడానికి, వేలంపాట పద్ధతి ప్రవేశపెట్టి మన ప్రభుత్వం రెవిన్యూ మంత్రి గారు చేసిన పద్ధతి మన అందరికి తెలిసినదే! అది చాలదన్నట్లుగా, ఎక్కడైనా వేలంపాటలకు రాకుండా భూములు ఏమైనా మిగిలిఉంటే, వ్యవసాయకూలీలు సాగుచేసే ఆ భూములపైకూడ అసెస్‌మెంటు ప్రకారం శిస్తు వేయడమే కాకుండా, దానికి లీజుప్రకారం వంద, రెండువందలు అదనంగా వేస్తాము అనడం ఏమాత్రము సమంజసమైన విషయంకాదు. ఈ రోజున సాగులోకి రాని భూములను సాగులోకి తీసుకొనివచ్చి, సాగుచేస్తుంటే, దానిని ప్రోత్సహించడానికి బదులు, సర్వే సెటిల్‌మెంటువారు నిర్ణయించిన రేట్లప్రకారం, రేట్లు వేయడమేకాకుండా దానికి పెనాలిటీలు, యింకోప్రక్కన లీజు రేటు కలిపి వసూలు చేయడం ఏమాత్రం బాగాలేదు, ఆంధ్రప్రాంతంలో యింకా ఎవరిచేతులలోనైనా అక్కడక్కడ ఎకరం, రెండెకరాలు లంకలు ఉన్నట్లయితే అక్కడనుంచికూడ ఆ వ్యవసాయకూలీలను తొలగించడానికి వేసిన పథకంలాగ ఉన్నది. ఇదివరకే వేలంపాటల పద్ధతిపెట్టి కొంతభూమి కాజేశారు. ఇప్పుడు ఈ విధంగా భరింపరాని పెనాలిటీలు, లీజులువేసి అధికమైన భారం మోపడం జరుగుతున్నది. అన్ అసెస్డ్ భూములకు సంబంధించినంతవరకు ఈ పెనాలిటీలు పదిరెట్లు, 20 రెట్లు వేయడం జరుగుతోంది. తెలంగాణా ప్రాంతంలో ఒక సొంతరైతు తన భూమిప్రక్కన ఉన్నటువంటి భూమిని, ఒక ఎకరం అయినప్పటికి సాగు చేసుకొంటున్నట్లయితే, దానిమీద శిస్తుకూడ కట్టనవసరంలేకుండా ఉన్నది. కాని ఆంధ్రప్రాంతలో, తన గట్టుప్రక్క ఉన్నదానిని ఆక్రమించుకొన్నట్లయితే, చాలా ఘోరంగా పెనాలిటీలువేసి ఎవిక్షన్ చేయడం జరుగుతోంది. ఇది అందరికి తెలిసిన విషయమే! ఈ రీత్యా చూచినట్లయితే తెలంగాణా చట్టంలో ఉన్న ప్రొవిజన్సు చాలా ఉపయోగంగా ఉన్నవని నేను భావిస్తున్నాను.

ఇక ఎవిక్షన్ పద్ధతులు చూచినట్లయితే— వ్యవసాయ కూలీలు అనేక రోజులనుంచి ఆ భూములలో సాగుచేసుకొంటున్నప్పటికి, ఆఖరుకు వరిపైరు కోతకు సిద్ధంగాఉండి, పంట చేతికివచ్చే సమయంలో దారుణంగా ఆ పైరును పాడుచేసి, ఆ భూమిని వశము చేసుకోడానికి ఈ చట్టంలో అధికారాలు ఉన్నాయి. ఉదాహరణకు-కొవ్వూరు తాలూకాలో, ఎల్లయ్యపాలెం గ్రామంలో అయిదు ఎకరాల భూమిని వ్యవసాయ కూలి సాగుచేసుకొంటూఉంటే— ఇకపంట 15, 20 రోజులలో కోసుకొంటారు, అనేసమయంలో, ఈ చట్టం దాఖలుచేసిన అధికారాలు ప్రకారం ప్రభుత్వం ఆ పైరును మేపించి, ఆ భూమిని ఆక్రమించుకోడం జరిగింది.

ఒకవేళ ఆక్రమించదలచుకొన్నచో పైరు లేనప్పుడే చేయాలి. పైరువేసి కొంత కాలం పెరిగిన తరువాత ఆపైరును గూడ నాశనం చేయుటకు ఈ నాడు మనచట్టములో provision ను పెట్టుకొనడం ఏ విధంగాను సమంజసం కాదు. అనేక ప్రాంతాలలో ఈ నాడు సుమారు పదివేల ఎకరాల వరకు మాగాణి భూమిని సాగుచేసుకొనే శివాయి జమాదార్లు ఉన్నారు. ఇది వరకు వారిని evict చేసే అధికారం కలెక్టర్ల చేతులలో ఉండేది. కాని ఈ నాడు ప్రభుత్వం తెస్తున్న చట్టం మూలంగా ప్రతి తహసిల్‌దారుకు ఎప్పుడు వడితే అప్పుడు evict చేసే అధికారం కలుగుచున్నది. దీని ద్వారా తహసిల్‌దార్లు అదేపనిగా కూర్చొని ప్రతి గ్రామంలోని శివాయి జమాదార్లను evict చేయుటకు పైర్లను మేపుటకు కావలసిన provision ను కలుగజేయడం చాలా దారుణంగా ఉన్నది. తెలంగాణ రైతులకు గాయిరాని భూములుగాని, శివాయిదారు భూములుగాని, 10% కు పైబడిన పట్టాలు ఇవ్వమని ఇదివరకు ప్రభుత్వం ఒక G. O. ను పాస్‌చేసి, ఆ విధంగా ఇచ్చుటకు ప్రయత్నించినది. కాని ఈ Act ప్రకారం శివాయి జమాదారు భూములను సాగుచేసుకుంటున్నప్పటికి వాటిమీద ఎలాంటి rights ఉండవని తేలిపోయింది. అందువల్ల ఇది schedule subjects ను affect చేస్తున్నదని భావిస్తున్నాను. ఈ Act తెలంగాణా ప్రాంతానికి అనువర్తింప జేయుటవల్ల ఇక్కడ ఉన్న సాంప్రదాయాలను, conventions ను, ఇక్కడి ప్రభుత్వోద్యోగులు అమలు పరచు విషయాలను prejudice చేయడమేగాక ఈ చట్టంలోని క్లాజు మూలంగా శివాయి జమా దార్లందరూ భుక్తికిలేకుండాపోయే ప్రమాదం వున్నదని నేను మనవి చేయుచున్నాను. ఈ చట్టమును ఇలాగే పాస్‌చేసినచో అమలులో ఎన్నో విపరీత పరిణామాలకు దారితీసే ప్రమాదమున్నదని మాత్రం మనవిచేస్తున్నాను. Evict చేయుటకు ఆరు నెలలు, లేక reasonable time అని provision లో చెప్పబడినది. Reasonable time అంటే కొన్ని సందర్భాలలో పైర్లను మేపడం కూడ ఎలా ఔతుందో నాకు అర్థం కావడంలేదు. పైర్లు పంటకు వచ్చుచున్నప్పుడు దానిని evict చేయుటకు కనీసం రెండు, మూడు నెలలు వ్యవధి ఇచ్చినచో ఆ వ్యవసాయ కూలీలు, చిన్నరైతులు ఆపైరును కోసుకొనుటకు వీలు ఉంటుంది. కాని అనేక సందర్భాలలో ఈ reasonable time అను దానిని చాలా విశృతంగా చేసి అమలుజరపడం జరుగుతున్నది. అందువల్ల ఏ వ్యవహారరీత్యా చూచినా తెలంగాణలో ఉన్న చట్టంకంటె ఉత్తమంగా లేదు. కేవలం ప్రభుత్వానికి, ప్రభుత్వోద్యోగులకు నిరంకుశమైన అధికారాలను ఇచ్చే చట్టమేగాని ఏ విధంగా ప్రజోపయోగకరమైనది కాదని మనవిచేయుచున్నాను. అనేక రోజులనుండి ప్రభుత్వం దగ్గరకు రాయభారం వెళ్ళి భూములు నిలబెట్టుకున్న వారందరికి కూడాను ఏమాత్రం జాగుచేయకుండా వెంటనే భూములనుండి వెళ్ళగొట్టటమే

ప్రధాన ఉద్దేశ్యంగా ప్రభుత్వం ఇలాంటి సవరణలను తీసుకువస్తున్నది, ఇది ఏమాత్రమూ సమంజసమైన సవరణ కాదు దీనివల్ల కొన్ని లక్షలనుంది బంజరు దార్లు దెబ్బతినే ప్రమాదమున్నది. కాన దీనిని ప్రజాభిప్రాయసేకరణకో లేక కనీసము సెలెక్టు కమిటీకో పంపాలి. సెలెక్టు కమిటీలో అక్కడివి, ఇక్కడివి సమగ్రంగా చర్చించుకొని ఉద్యోగస్థుల సలహాలు తీసుకొని, ఏ విధంగా దీని inter-pretation లో implications వస్తవనే విషయంలోగూడ బాగా ఆలోచించుకున్న తరువాతనే దీనిని చట్టం చేయవలసిన అవసరమున్నది. లేనియెడల జనరల్ గా ఆంధ్రప్రదేశ్ లోనూ, ప్రత్యేకంగా తెలంగాణలో దారుణమైన పరిస్థితిని కల్పిస్తుంది శివాయి జమాదార్లను evict చేయుటకు తహసిల్ దార్లకు అధికారాలను ఇవ్వడం వెన్నుపోటు లాంటింది....

శ్రీ కె. వెంకటరావు : వూరికే 'దారుణం, దారుణం' అంటూ ఉన్న పనులన్నీ అంటుకపోతుందేమోనని భయం.

శ్రీ జి. యల్లమందారెడ్డి : నోటిపద్ద తిండిని తీసివేయడమే దారుణమని నా నిర్వచనం. ఐదు ఎకరాలు చేసుకొని రేపో, ఎల్లుండో పంట కోతకు వస్తుందని ఎదురు చూస్తున్న సమయంలో కలెక్టరు ఈ provisions ఉపయోగించి పోలీసులను, గొడ్లనుపెట్టి ఆ పైర్లను నాశనం చేయడం దారుణం కాక మరి ఏమౌతుంది?

శ్రీ కె. వెంకటరావు : ఈపని యల్లమందారెడ్డిగారి స్వంత భూములలో చేసినప్పుడు దారుణమో, కాదో ఆలోచించవచ్చు.

మిస్టర్ స్పీకర్ : ఏదైనా unparliamentary గా ఉన్న మాటలో చెప్పండి. "దారుణం" అనే పదం unparliamentary word కాదు.

శ్రీ జి. యల్లమందారెడ్డి : స్వంత భూముల విషయం కాదండి. అనేక రోజులనుండి బంజర్లను సాగుచేసుకొని సుక్షేత్రమైన పొలాలుగా మార్చినందువల్ల పట్టా యివ్వమని ప్రభుత్వం order చేసిందేగాని కేవలం స్వంత భూములైనంత మాత్రాన మంత్రిగారు అలాచేయలేదు. అందువల్ల దీనిని సెలెక్టు కమిటీకి పంపించాలని కోరుతున్నాను.

శ్రీ పి. వి. రాజేశ్వరరావు (సిద్ది పేట) : అధ్యక్షా! గౌరవనీయులైన రెవెన్యూ మంత్రిగారు ప్రవేశపెట్టిన బిల్లును హృదయపూర్వకంగా నేను బలపరుస్తున్నాను. ప్రతిపక్షసభ్యులుగూడ తెలంగాణకు ముఖ్యమైన బిల్లు అని చెప్పినారు. వారితో ఏకీభవిస్తూ తెలంగాణలో ఒకవైపు జమీందార్లు రెండవవైపు రాజకీయ పార్టీలవారు తమతమ పార్టీలను బలం చేసుకొనుటకు ప్రభుత్వ అనుమతి లేకుండానే

భూములను కబ్జా చేసుకొని గ్రామాలలో అల్లకల్లోలాను రేకెత్తించడం మనం వింటూనే ఉన్నాము. ప్రతి తహసిల్ ఆఫీసులోను, అమీన్ కచ్చేరీలలోను ఎన్నో ఇలాంటి వివాదాలను మనం చూస్తూనే ఉన్నాము. శాసనం ఉన్నప్పటికి దానిని ఉల్లంఘించి భూములను కబ్జా చేసుకొనడం ఎంతవరకు న్యాయమో మనం ఆలోచించవలసియున్నది ఏ గ్రామంలోనూ పేదప్రజానీకం ఆ భూములను ఆక్రమించుకొనుటలేదు. ఆ గ్రామాలలో ఉండు జమీందార్లు, బలవంతులు మాత్రమే వాటిని ఆక్రమించుకోగలుగుతున్నారు మరొకవైపు బలంగా ఉన్న రాజకీయ పార్టీలవారు పోరంబోకులను, గాయిరాను భూములను కబ్జా చేసుకుంటున్నారు. పోరంబోకులను, గాయిరాను భూములను స్వాధీనం చేసుకొనుటకు తహసిల్దారు దగ్గరకు వెళ్ళి ఏక్సాల పద్ధతిని క్రమబద్ధం చేయునట్లు చేయుట మంచిది. అలా గాకుండా 'బడితె ఎవరిదో బర్రె ఎవరిదో' అన్నట్లు ఆ భూములను ఆక్రమించుకోవడం మంచి పద్ధతికాదు. ఇందుకు ఈ బిల్లు చాలావరకు అనుకూలంగా ఉన్నది ఎవరైనా బలవంతంగా కబ్జా చేసుకున్నచో వారిని తొలగించుటకు 157 సెక్షన్ ప్రకారం కలెక్టరుకు మాత్రమే అధికారం ఉన్నది గాని తాసిల్దారుకు ఎటువంటి అధికారమూ ఇవ్వబడలేదు, తాసిల్దారు తావాన్లువేసినా ఆ penalties చెల్లించకండా పెద్దఎత్తున గ్రామాలలో processions తీసుకుంటూ శాసనవిరుద్ధంగా చేయుపనులను తొందరగా అరికట్టాలని నేను మనవిచేయుచున్నాను. భూములను ఏక్సాలపాస్ పద్ధతి ప్రకారం వారికి పట్టాలు లావుణీ పాస్ రూల్సు ప్రకారం ఇవ్వాలి అంతేగాని ప్రతివాడు పోవడం, వాటిని కబ్జా చేసుకోవడం, వివాదాలు జరగడం, కేసులు తయారు కావడం మంచి పద్ధతికాదు, ఈవేళ ప్రతిపాదించబడిన బిల్లు గ్రామాలలో మంచి శాంతియుత పరిస్థితులను కలిగించగలదని, ఇది సామాన్య రైతులకు చాలా అనుకూలమైన మంచి బిల్లు అని నేను హృదయపూర్వకంగా బలపరుస్తున్నాను. Unauthorised Encroachment వల్ల 10% గాయిరాని భూమి పశువుల మేతకు ఉంచాలనే సర్క్యులర్‌నుగూడ ఉల్లంఘించడం జరుగుచున్నది. బిల్లువల్ల తాహసిల్దారుకు అధికారం లభిస్తున్నది గాన అగస్ట్‌ని సక్రమంగా అమలు చేయుటకు అవకాశముంటుంది. ఇప్పుడు ఎవరో ఒకరు దానిని ఆక్రమించుకోవడం, పటేలు, పట్వారీలు దానిని రిజిష్టరులో వ్రాయకపోవడం, దానివల్ల రావలసిన రెవెన్యూను కూడ కాజేయడం జరుగుతున్నది. వాటి అన్నింటిని క్రమబద్ధం చేయుటకు ఈబిల్లు ఎంతో తోడ్పడుతుంది. కావున దీనిని పాస్ చేయాలని కోరుతున్నాను.

శ్రీ కె. కోటిరెడ్డి (లక్కిరెడ్డిపల్లి): అధ్యక్షా! ఈ బిల్లును నేను బలపరుస్తూ ఒక విషయం మాత్రం ప్రభుత్వం వారి దృష్టికి తెస్తాను. మంత్రిగారు దీర్ఘంగా

ఆలోచన చేస్తారని నమ్ముతున్నాను. Eviction చేసే అధికారం కలెక్టరు, రెవెన్యూ డివిజనల్ ఆఫీసరు చేతులలో ఉన్నది. వారికి పైన అప్పీల్సుంటాయి. చిన్న చిన్న భూములనుండి evict చేసినా, ఒక చిన్న గుడిసెను పెరికివేసినా హెచ్చునష్టం ఉండకపోవచ్చును. ఈ విషయాలలో రివెన్యూబోర్డుకు అధికారం ఉండినా గవర్నమెంటు revisional authority exercise చేస్తూ ఉండేది. అన్ని విషయాలను ఆలోచించి ప్రభుత్వం తీర్మానం చేస్తూ ఉండేది. నేను రివెన్యూ మంత్రిగా ఉన్న రోజులలో ఒక విషయం వచ్చినది. 50, 60 వేలు ఖర్చుచేసి ఒకాయన రోడ్డుప్రక్క పెద్ద ఇల్లుకట్టాడు. ఇల్లుకట్టినది ట్రింక్ రోడ్డు ప్రక్క. Eviction Orders పాసు అయినాయి. Legal గాను, technicalగాను ఆలోచిస్తే 60 వేల రూపాయలు ఖర్చుచేసి కట్టిన మాడిగను పడగొట్టవలసి ఉన్నది. ఈ విషయం నావద్దకు వచ్చింది. 50, 60 వేల రూపాయలు ఖర్చుచేసి కట్టిన భవనాన్ని పడగొట్టడం బాగాలేదని దీర్ఘంగా ఆలోచించాము. ఏదో ఒక త్రోవ దొరికింది అనుకోండి. ఎగువ మార్గంగా రోడ్డు త్రిప్పినట్లయితే అతనికి నష్టం లేకుండా ఉంటుంది; రోడ్డును త్రిప్పడానికయ్యే ఖర్చు అతనిచేత భరింపచేస్తే సరిపోతుందని అనుకున్నాము. గవర్నరు దగ్గరకు వెళ్లింది. ఆ ఇల్లు అట్లాగే ఉంది. ఈ eviction చేసే అధికారం తాసిల్దారుకు ఇవ్వాలని ఉద్దేశిస్తున్నారు. మంచి తాసిల్దారున్నట్లయితే అన్నీసరిగానే చూసి చేస్తాడు. అందరూ మంచి తాసిల్దారులని చెప్పలేము. కొంతమంది దుర్మార్గులుండవచ్చును. అటువంటి సందర్భాలలో ఏమి జరుగుతుందో వేరే చెప్పవలసిన అవసరంలేదు. నా అనుభవం దృష్ట్యా ఆలోచిస్తే, ఈ అధికారాన్ని తాసిల్దారుకు ఇవ్వడం మంచిది కాదని చెప్పగలను. మంత్రిగారు objects and reasons లో చెప్పారు. General assessment చేయడానికి తాసిల్దారుకు ఇదివరకే అధికారం ఉన్నది; encroachment న్యాయమా, కాదా, అనే విషయం తీర్మానం చేయవలసింది వారే అన్నారు. General assessment కు evicton కు చాలాభేదం ఉన్నది. రు. 50 లు వేయడానికి రు. 100 లు general assessment వేశారనుకున్నా, ఆడబ్బు పోతుందే కాని అంతకంటే హెచ్చు నష్టం ఉండదు. క్రింద అధికారులు తొందరపాటు వలన ఒక పెద్ద భవనాన్ని పడగొట్టించినారనుకోండి; ఎంతనష్టం? పిమ్మట ప్రభుత్వంవద్దకు వెళ్లినా ఏమి ప్రయోజనం? అప్పీలుచేసినా లాభంలేదు. ఆంధ్ర area అనే విషయం గురించి ఒక సవరణను ఇచ్చాను. ఆ విషయమై సవరణల సమయంలో మాట్లాడితే చాలును అనుకుంటాను. తాసిల్దారుగారికి eviction చేసే అధికారం ఇవ్వకూడదని మరొకసారి మనవిచేస్తూ మంత్రిగారు, సెలక్టు కమిటీవారు దీనిని గమనించాలని కోరుతున్నాను.

శ్రీ జి. గంగారెడ్డి (ముధోలు): అధ్యక్షా! ఈ బిల్లును పరిశీలిస్తే పూర్వపు చరిత్రకు ఇప్పటికి చాలా తేడా కనిపిస్తుంది. 'దున్నేవానిదే భూమి' అని వినాదాలు కొట్టి తీసుకువచ్చిన స్వరాజ్యం పునాదికే నేడు అపాయం కలుగుతున్నది. ఆ కాలంలో 'దున్నేవానిదే భూమి' అని చెప్పినారు; ఇపుడు స్వంతభూమిలోనుంచి కవులు భూమిలోనుంచి వంకరటింకర చట్టాలద్వారా దాఖలు చేస్తున్నారు. పోరంబోకులను బాగుచేసి సాగుబడిలోనికి తెచ్చి 10 సంవత్సరాలు అనుభవించిన తరువాత ఆ భూములకు పట్టాలను భూములులేనివారి కివ్వాలని సర్క్యులర్లు జారీ చేశారు. కాని ప్రభుత్వంలో ఉండే ఉద్యోగుల లంచగొండితనంవల్ల రూపాయిలు ఇచ్చినవారికే తక్తాలలో షరీకుచేసినారు. రూపాయిలు ఇవ్వలేని పేద ప్రజలకు తక్తాలు తయారు చేయలేదు. ఆ సర్క్యులర్ల ప్రకారం చేసి ఉన్నట్లయితే భూమి మిగులకుండా ఉండేది, ఉద్యోగులు లంచానికి మరగడంవల్ల సాగుబడి అయిన భూములను పెత్తనదారులు హర్రాజులో మేము కొంటామని చెప్పడానికి ఉపయోగకరం అవుతున్నది. దీనితో దున్నేవానిదే భూమి అన్నపదములు సంపూర్ణంగ ఖతమైపోయినవి. సేద్యంకొరకు భూములలోని చెట్టు, గుట్టలను అన్నింటిని తొలగించి శుభ్రంగా చేసినతరువాత ఆ భూములనుంచి వారిని తొలగించడం మంచిగా లేదు. ఈ బిల్లును ప్రజాభిప్రాయానికైనా లేక కనీసం సెలక్టు కమిటీకైనా పంపాలని కోరుతూ విరమిస్తున్నాను.

శ్రీ ఉప్పల మల్సూర్ (సూర్యాపేట - రిజర్వుడు): అధ్యక్షా! భూమి ఆక్రమణలకు సంబంధించిన చట్టం మనముందుకు తేబడింది. రివిన్యూ డివిజనల్ ఆఫీసరుకు కాని, కలెక్టరుకుగాని ఉన్న అధికారం తాశ్శిల్దారుకు అప్పజెప్పే విషయం మనముందుకు వచ్చినది. దీనిని చర్చిస్తున్నాము. ఇంతకుముందు గౌరవసభ్యులు చెప్పినట్లు, ఆంధ్రకు సంబంధించినంతవరకు భూములనుంచి తొలగించే అధికారమనేది ఉన్నప్పటికి— ఉన్నదో లేదో సరిగా నాకు తెలియదు— హైదరాబాదు ప్రభుత్వం ఉండగా భూములనుంచి తొలగించడానికి, తొలగిస్తే ఏ పద్ధతిలో తొలగించాలనే విషయమై, తొలగించినవారికి ఏమి హక్కులు ఇవ్వాలనే విషయమై ఎప్పటికప్పుడు సర్క్యులర్లు జారీచేస్తూ వచ్చినారు. భూమిమీద హక్కు ఇవ్వడానికి సర్క్యులర్లు జారీచేసినారు కాని భూమినుంచి బేదఖలు చేయడానికి సేద్యం కొరకుకాక మేపడంకొరకు కాని 10% పద్ధతిమీద కాని ఏమీ సర్క్యులర్లు జారీచేయలేదు. అటువంటి చట్టమూలేదు. ఇంతవరకు ఆచరణలోకి రాలేదు. దీనిప్రకారం 1948-49 నుండి సేద్యంచేస్తున్న భూములు యీనాడు బేదఖలు కావలసివస్తుంది. కలెక్టరుకున్న అధికారాన్ని తహసీల్దారు కివ్వడంవల్ల ఎవరెవరిని భూములనుండి తొలగించాలో ఆ భూములను ఎవరెవరికి కట్టబెట్టాలో తహ

సీల్దారే నిర్ణయించి, బీదవారికి భూమిపైగల ఖబ్జాహక్కు తొలగించే పని చకచకా సులభంగా సాగిపోతుంది. రైతులకు మేలు చేకూర్చడానికే యీ బిల్లు తెచ్చామని మంత్రిగారంటున్నారు. కాని వారు ఉద్దేశ్యపూర్వకంగా తెచ్చిన యీ బిల్లు ప్రజలకు మేలుచేయడానికి బదులు వారిననేక కష్టనష్టాల పాలుచేస్తుంది. ఉదాహరణకు నా నియోజకవర్గం అయిన సూర్యాపేట గురించి చెబుతున్నాను. అక్కడ నైజాము ప్రభుత్వం వుండగా 10% భూమి పశువులు మేపడానికి కేటాయించి మిగతా భూమి సేద్యం చేసుకోడానికి అనుమతిస్తూ ఒకటినుండి ఎనిమిదివరకు సర్క్యులర్లు శ్రీ రంగారెడ్డిగారు మంత్రిగావుండగా రోజుకొక సర్క్యులరు పంపించేవారు. పంపించినప్పటికీ దానిప్రకారం రైతులను భూములనుండి తొలగించడానికి సాధ్యపడలేదు. వారు భూములను సేద్యం చేస్తూ పంటలు పండిస్తూ పెనాల్టీలు కట్టుకుంటూ భూమిని వదలకుండా వున్నారు. దానికి కారణం నిర్దుష్టమైన చట్టం లేకపోవడమే. ఈ చట్టంవల్ల తహసీల్దారుకు రైతును భూమినుండి తొలగించే హక్కు యివ్వడంవల్ల పెత్తందారీవర్గంకు కావలసినట్లు రైతులను తొలగించేపని తేలిక అయిపోతుంది. ఇది తెలంగాణాకు క్రొత్తగా వర్తింపచేసే చట్టం కాబట్టి దీనిని ప్రజాభిప్రాయానికి పంపడమో లేక సెలెక్టు కమిటీకి పంపడమో చేసి ఆంధ్రలో వున్న చట్టాన్ని తెలంగాణాకి వర్తింపచేసేకంటె తెలంగాణాలోవున్న మంచి పద్ధతిని ఆంధ్రకు ఎందుకు వర్తింపచేయకూడదని ఆలోచించాలి. లేకపోతే మదరాసులోని చట్టాలను బుద్ధిపూర్వకంగా తెలంగాణాపై రుద్దడానికి చేసే ప్రయత్నం అని తేలిపోతుంది. అందుచేత దీనిని సెలెక్టు కమిటీకి పంపించి తెలంగాణాలోని మంచి పద్ధతులను ఆంధ్రకు వర్తింపచేసి బీదప్రజలకు మేలు కలిగించాలని కోరుతున్నాను.

శ్రీ వి. కూర్మయ్య (గుడివాడ-రిజర్వుడు): అధ్యక్షా! మంత్రిగారు తెచ్చిన సవరణలు ముఖ్యంగా labour హరిజనుల స్థితిని affect చేసేదిగా వుండడంచేత నేను మాట్లాడక తప్పలేదు. బంజరు భూములను లంకభూములను ఆక్రమించడం అనేది గత 40 సంవత్సరాలనుండీ వచ్చిన చరిత్ర. ఎప్పుడో జస్టిసు పార్టీవారు పరిపాలన చేస్తున్న Diarchy లో ప్రభుత్వంవారు హరిజనులను ఉద్ధరించి వారి స్థితిగతులను బాగుచేయాలనే వుద్దేశ్యంతో 1922-28 సంవత్సరాలలో బంజరు భూములను హరిజనులకు depressed clases కి అన్ని జిల్లాలలో కొంత percentage కేటాయించారు. అయితే ఆ భూములను హరిజనుల కివ్వకుండా యితరుల కివ్వడం కూడా తటస్థించింది. జస్టిసు పార్టీవున్న రోజులలోనే హరిజనుల కిచ్చిన భూములను ఎవరూ కొనకూడదనే షరతులు పెట్టారు. హరిజనులు బీదవారు కనుక ధనిక రైతులు వారికి అప్పు లిచ్చి భూములను కాజేస్తారనే వుద్దేశ్యంతో జస్టిసు పార్టీవారు చాలా ఉపకారం చేశారు. అయితే తరువాత కాంగ్రెసు

ప్రభుత్వం వచ్చింది. కాంగ్రెసు ప్రభుత్వంలో శ్రీ ప్రకాశం పంతులుగారు ముఖ్యమంత్రిగా వుండగా,—ఆయన చాలా విశాల హృదయం గలవారు. హరిజనులు బీదవారు అంటే చాలా దయగలవారు కనుక— శివాయి జమాదారులకు పట్టాలివ్వాలని Cabinet లో నిర్ణయించారు. అప్పుడు నేను కూడా అక్కడ వుండడం తటస్థించింది. తరువాత ఆయన ఒక సంవత్సరంలో రాజీనామా యివ్వడంవల్ల శ్రీ ఓమాండూరు పెదరామస్వామి రెడ్డియార్ కాబినెట్ వచ్చింది. ఆయనకూడా శివాయి జమీదార్లకు అభ్యంతరంకాని భూములకు పట్టాలివ్వాలని Cabinet లో నిర్ణయించారు. నేను అక్కడ సంవత్సరమున్నర వుండి శ్రీ కళా వెంకటరావుగారితో యుద్ధంచేసి Cabinet ద్వారా pass చేయించి officials కి circular పంపించాము. అయితే ఆఫీసర్లెవరూ దానిని అమలుపరచ లేదు. కొంత మంది ప్రతిపక్ష సభ్యులు చెప్పినట్లు కరణం, మునసబులు లంచాలకొరకు 60 రూపాయలిస్తేనే పట్టాలు తెప్పిస్తామనే వుద్దేశ్యంతో పట్టాలు యెవ్వరికీ యివ్వలేదు. అది ఆ విధముగా వుండిపోయింది. అది ఒక చరిత్ర. అందుచేత యిప్పుడు మంత్రిగారు తెచ్చిన యీ సవరణవల్ల తహసిల్దారుకు అధికారం యిస్తున్నారు. తహసీల్దారులెటువంటివారో మనకందరకు తెలుసును. వారు కరణం మునసబుల రిపోర్టులమీద ఆధారపడతారు. తహసీల్దారు అక్కడున్న రివిన్యూ యినస్పెక్టర్లు పెద్ద రైతులు ఎవరైతే dinner party లిస్తారో వారి చెప్పు చేతలలో వుంటారని మనకందరకు తెలిసిన విషయమే. ఎక్కడో ఒకరిద్దరు మంచివారు independent views గల తహసీల్దారులు లేకపోలేదు. అందరూ ఆ విధముగానే వుంటారని నేననను. కాని చాల మంది landless హరిజనులకు భూములివ్వడానికి వ్యతిరేకంగానేవుంటారని గౌరవసభ్యులకు తెలుసును. గ్రామాలలోకివెళ్ళితే హరిజనుడు కూలివాడుగానే వుండాలనీ, పాలేరుగానే వుండాలనీ, ప్రభుత్వం భూమి యిస్తే పనిలోకి రాడని పట్టాలివ్వకుండా చేశారు. ఇప్పటికి రివిన్యూ మంత్రిగారు యిది వరకు మంత్రిగా వున్నప్పుడే ఆశీర్వానం చేశారు. ఇంతవరకు ఎంత మందిశివాయి జమాదార్లకు పట్టాలిచ్చారని మంత్రిగారిని తమ ద్వారా అడుగుతున్నాను. కాంగ్రెసు ప్రభుత్వం హరిజనులను వుద్ధరించడానికి వచ్చిందని నేను నమ్ముతున్నాను; ప్రపంచం అంతా నమ్ముతున్నది. అయితే కాంగ్రెసు ప్రభుత్వంవచ్చిన తరువాత హరిజనులకు విద్యా విషయం తప్పించి భూవసతి కలుగజేసే విషయంలో మాత్రం చాలావ్యతిరేకంగా చేస్తున్నదని figures ద్వారా నిరూపించగలను. Diarchy వున్న రోజులలో జస్టిసు పార్టీ ప్రభుత్వం Full powers లేకుండా చేసిన చట్టాలే హరిజనులకు చాలా అనుకూలంగా వున్నాయి. అటువంటి దానిని సిద్ధాంతరీత్యా Systematic గా హరిజనులకు అపకారం చేయడానికి శ్రీ కళా వెంకటరావుగారు రెవిన్యూ మంత్రిగా మారుస్తున్నారనే విష

యం నా మనస్సులో పడిపోయింది. అయితే ప్రభుత్వానికిది తెలియదని నేను అనుకుంటున్నాను. ముఖ్యమంత్రిగారికి తెలిసినట్లయితే అటువంటి పనులు జరుగనివ్వరు. ఆయన మీద మాకు నమ్మకం వుంది. ముఖ్యంగా వెంకటరావు గారు, ఆయన Constituency లో హరిజనులు ఓట్లు ఇవ్వలేదని, దృష్టిలో పెట్టుకొని, రాష్ట్రం మొత్తంగా వారికి అపకారం చేయటానికి ప్రయత్నించటం చాలా విచారకరము. వారు ఆ విధంగా ప్రయత్నించటం అక్కడి హనుజనుల దురదృష్టమని నేను అనుకొంటున్నాను.

మిస్టర్ స్పీకర్:— అట్లా పర్సనల్ ఎలిగేషన్ చేయకూడదు.

శ్రీ వి. కూర్మయ్య.— నేను పర్సనల్ ఎలిగేషన్ చేయటంలేదు. రెవిన్యూ మంత్రిగా వారు చేస్తున్నటువంటి పనులను తమ ద్వారా ప్రభుత్వానికి తెలియ జేస్తున్నాను. ఇప్పుడు లంక భూములమీద ఇదివరకు ఉన్నటువంటి ఎసెస్‌మెంట్ మీద 40% Enhance చేశారు. అది చాలా తప్పని మేము చెప్పాము. అంతేకాదు; Eviction of Lanka Lands కూడా ఉన్నాయి. ఈ లంక భూములనుబంజరు భూములను ఇది వరకటి జస్టిస్ ప్రభుత్వం హరిజనులకు ఇచ్చింది. లీజ్‌కుఇచ్చిన లంకభూముల మధ్య కొత్తలంక ఏర్పడినట్లయితే, సాధారణంగా ఆ లంక లీసెస్ వాళ్ళే ఆ భూమి చేసుకొంటారు. ఆ భూములను Evict చేయటానికి తహశీల్ దార్‌కు అధికారం ఇవ్వటంవల్ల, ఏ లేబర్‌ను ఉద్ధరించాలని యీ కాంగ్రెసు ప్రభుత్వం అనుకొంటున్నదో, ఆ లేబర్‌కు అపకారం జరుగు తున్నదని మీద్వారా ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను. శివాయి జమాదార్లకు ప్రకాశంగారి ప్రభుత్వంలో, ఓమాండూర్ రెడ్డియార్‌గారి ప్రభుత్వంలో చేసిన తీర్మానాలు అమలు జరిపి యీ చట్టము తెస్తే నాకు అభ్యంతరములేదు. అంతేకాని, ప్రభుత్వం ఇష్టము వచ్చినట్లు Evict చేయటం సరైంది కాదు. పబ్లిక్ రోడ్డుగాని, పబ్లిక్ బిల్డింగు గాని, నిర్మించాలంటే, తప్పకుండా దానిని Evict చేయవలసిందే—కాని ఎప్పుడు Evict చేయాలంటే; గవర్నమెంటు చేసిన G. O లోని తీర్మానాలు అమలుజరిపి; Evict చేస్తే నాకు అభ్యంతరం లేదు. అది చేయకుండా Evict చేయటం సరైందికాదు. ఈనాడు లక్షలాది హరిజనులు, Landless Labourers యీ భూములు చేసుకొంటున్నారు. నేను ఒకటే మంత్రిగారిని అడుగుతున్నాను; శివాయి జమాదార్లకు అభ్యంతరం లేనటువంటి భూములు చేసుకొనే వారందరికి వెంటనే పట్టాలు ఇప్పించండి. ఈనాడు ప్రభుత్వం డబ్బు కావాలని కోరుతున్నది. Land assessment ఎక్కువ చేశారు కాని భూమిలేని వారికి భూమి దొరకటం లేదు. కేవలం హరిజనులు భూమి మీదనే ఆధారపడి ఉన్నారు. ఒకపుట్టి పంట పండితే, అందులో అరపుట్టి assessment కు పోగా, మిగిలిన అరపుట్టి ధాన్యంతో

అతని భార్య బిడ్డలు జీవిస్తున్నారు. హరిజనులు, Landless Labourers తిండి లేక బాధపడుతున్నారని తమకు తెలుసు. వారికి తిండి దొరకదు. నీళ్లు ఉండవు. వండుకోటానికి పుల్లలు ఉండవు. 3 రోజులు వరుసగా వర్షం కురిస్తే వాళ్లు కష్టాలు పడుతూ ఉంటారు. ఉన్నవ లక్ష్మీనారాయణగారు "మాలపల్లి" అని ఒక పుస్తకము వ్రాశారు. దాంట్లో 'మడత కుడుములు' అని వ్రాశారు. మడత కుడుములు అంటే గౌరవ సభ్యులకు తెలియక పోవచ్చు. వారికి తిండి లేక వాళ్ళ పేగులు మడతపడి పోయి, వాళ్ళు మూలుగుతూ పడే మడత కుడుముల బాధ ఈ ప్రభుత్వం గ్రహించవలసి ఉంటుంది. నేను రెవిన్యూ మంత్రి గార్ని ప్రార్థిస్తున్నాను. "నీవు బ్రాహ్మణ కులంలో పుట్టావు, నీవు Highest Caste లో ఉన్నావు. నేను దాసుణ్ని; నీవు బ్రాహ్మణుడవు. మనిద్దరికి ముష్టి చెంబు తప్పదు." అని చెపుతున్నాను. మనం అడుక్కునే బెగ్గర్ జాతికి చెందిన వాళ్ళం. మన హిందూదేశంలో బెగ్గరిజమ్ చాలా ఆనరబుల్ స్టేజ్‌లో ఉన్నది. అది స్వార్థము లేనటువంటిది. "మనము ప్రజాసేవ కొరకు పుట్టాము. కాబట్టి హరిజనులకు, భూమి లేని పేదవారికి భూములు దొరికే విధంగా మంచి చట్టం చెయ్యవయ్యా" అని రెవిన్యూ మంత్రి గారికి సలహా చెప్పాను. కాని వారు నా సలహా పాటించలేదు. ఇప్పుడు దీనివల్ల కోట్లకొలది జనులు effect అవబోతున్నారు. వారియొక్క ఉద్ధారణ కొఱకు ఏది మంచిదో అదిచేయటం అవసరం. ప్రభుత్వం చట్టబద్ధకంగా ఈ Evictions అన్నీ గట్టిగా అమలు పరచడానికి తగు విధంగా చట్టాలను మార్పు చేసుకొని Evictions చేయటం అవసరం. మంత్రి గారు ఇవన్నీ ఆలోచించాలని కోరుతున్నాను.

* శ్రీ యం. రాజేశ్వరరావు (దివి - రిజర్వుడు): అధ్యక్షా! ఇప్పటికైనా ప్రభుత్వంవారు యీ బిల్లును తీసుకువచ్చినందుకు మంత్రిగారిని అభినందిస్తున్నాను. ఈ బిల్లు ఏ ప్రజానీకం కొరకైతే తీసుకువచ్చామని చెబుతున్నారో, వారికి ఉపయోగపడుతుందనే ఉద్దేశంతో దీనిని తేలేదు. ఇదివరకు ప్రభుత్వంవారికి చట్టంలో అధికారం లేకపోయినా, ప్రతిదినం ఇక్కడకు రివిజన్ పిటీషన్లు రావటం, దాని మీద ఆర్డర్స్ pass చేయటం జరుగుతున్నది. ఈ మధ్య కొన్ని రిట్ పిటీషన్స్ హైకోర్టుకు వెళ్లబట్టి "మాకు powers లేవని" ప్రభుత్వమువారు ఇప్పటికైనా గుర్తించి, దానిని చట్టబద్ధం చేయటానికి యీ బిల్లును తీసుకువచ్చినందుకు సంతోషిస్తున్నాను. అయితే ఇప్పుడు కూర్మయ్యగారు ఒక ఉపన్యాసం ఇచ్చారు. ఇదివరకు R. D. O. చేతిలోఉన్న eviction powers యీనాడు తహశీల్ దారుకు ఇచ్చిన కారణంచేత, ఏదో బ్రహ్మాండమైన నష్టము హరిజనులకు కలుగుతున్నదనే అభిప్రాయం వారు చెప్పారు. అయితే అది ఒక విధంగా నిజము అయినప్పటికీ

ప్రస్తుతం జరిగేవిధానం చూస్తే మనకు బోధపడేదేమిటంటే;— తహశీల్ దారుగారు పంపించే ప్రపోజల్స్‌మీద R. D. O. గారు సంతకం పెట్టటంతప్ప, ఆయన "ఏదో తహశీల్ దార్ తప్పుచేశాడు కాబట్టి, నేను eviction order pass చేసేముందు. పర్సనల్ ఇన్స్‌పెక్షన్ చేసి, అన్నీ ఆలోచించి eviction order pass చేద్దాము" అన్న ఉద్దేశంతో eviction orders pass చేయటంలేదు. కాబట్టి eviction orders తహశీల్ దారు pass చేసినా ఒకటే; R. D. O pass చేసినా ఒకటే. పోతే ఆ అధికారం తహశీల్ దారుకు ఇస్తే ఇంకా, కొంత quick గా disposal జరగటానికి అవకాశం ఉన్నది. సెక్షన్ 6 క్రింద Eviction Notice లు జారీ చేసే టప్పుడు, దానిమీదవచ్చే అప్పీల్స్ గవర్నమెంట్ లెవెల్ కు వెళ్లితేతప్ప (ఏ డిప్యూటీ కలెక్టరోగాని) యీ భూములు inspect చేయటం జరగటంలేదు. అయితే యీ విషయాన్ని ప్రభుత్వదృష్టికి ఎన్నోసార్లు తీసుకువచ్చాము. ఒక వ్యక్తిని పర్మనెంట్ గా ఆ భూములనుండి తొలగించేముందు, ప్రభుత్వానికి రివిజన్ పిటీషన్ పెట్టుకొన్నప్పుడైనా, కలెక్టర్ స్థాయిలో ఉన్న ఉద్యోగస్థునిచేత inspection చేయించి "ఇది నిజంగా, యీ చట్టంలో నిర్వచించబడిన మేరకు objectionable" అని తోచినప్పుడే, పర్మినెంట్ గా eviction చేయించటానికి ప్రయత్నం చేయండని ప్రభుత్వానికి చెబుతున్నాను. చివరకు, ఏ కరణము అయితే, ఏ రెవిన్యూ ఇన స్పెక్టర్ అయితే ఇది objectionable అని సిఫార్సు చేస్తున్నారో, అదేవిధంగా రెవిజన్ స్టేజ్ లోకూడా అమలు జరుగుతోంది తప్ప, కొత్తవిధానము అమలు జరగటంలేదని చెబుతున్నాను. రెవిన్యూ మంత్రిగారికి యీ విషయంలో ఒకటి జ్ఞాపకం చేస్తున్నాను. అమలాపురం ప్రాంతంలో ఒక విషయం జరిగింది. కరణం గారు రికమెండ్ చేయగా, రెవిన్యూ బోర్డువారు 5 ఎకరాలు మంజూరుచేసి, ఎసైన్‌మెంట్ ఆర్డర్ ఇచ్చి అదే కరణంగారి investigation మీద, అదే రివిన్యూ బోర్డు "ఇది objectionable" అని తిరిగి దానిని cancel చేశారు. ఇది అబ్ జక్షనబులా, కాదా అని నిర్ణయించే అధికారం కేవలం క్రిందఉన్నటువంటి రెవిన్యూ ఇన్స్‌పెక్టర్, కరణము మొదలైన ఉద్యోగస్థుల చేతుల్లో ఉంది తప్ప, పెద్దవారు ఫైనల్ గా నిర్ణయించనందువల్ల, యీ ఫైనల్ ఆర్డర్స్ రావటంలేదని నేను ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను. ఒక వ్యక్తిని permanent గా evict చేసేటప్పుడు ప్రభుత్వం అన్ని విషయాలు జాగ్రత్తగా ఆలోచించి, వారిని evict చేయవలసి ఉంటుందని తెలియజేస్తున్నాను. "ఏ ప్రాపర్టీలో ఆక్రమణచేస్తే, అది objectionable అని యీ చట్టంప్రకారం అనుకొంటున్నారో" ఆ నిర్వచనంక్రిందకు అది వచ్చినపుడు, ప్రభుత్వం త్వరగా దానిని evict చేస్తే బాగుంటుందని నేను ప్రభుత్వానికి సలహా ఇస్తున్నాను. ఎందుకంటే, తూర్పు గోదావరిజిల్లాలో, శ్రీరంగపురం మొదలైనటువంటి గ్రామాలలో 12, 20 సంవత్సరాలనుండి unobjectionable గా పేరొన్న

బడినటువంటి యీ ఆక్రమణలు, యీనాడు ఆక్షేపణకరంగా భావించబడి, వారికి eviction orders జారీచేస్తున్నారంటే, ఇది చాలా విచారంగా ఉంది.

ఇవాళ ఒక ఆఫీసరు ఒక విధమైన రిమార్క్ వ్రాస్తే, రేపు ఇంకో ఆఫీసర్ ఇంకోవిధంగా రిమార్క్ వ్రాస్తున్నాడు. "ఇది నిజంగా ఆక్షేపణకరమా, కాదా" అని ఫైనల్‌గా నిర్ణయించేవారు ఎవరు? ఇప్పుడు 'తీసుకొనే నిర్ణయం' శాశ్వతమైనదని చెప్పటానికి వీలులేకుండా ఉన్నది. దీనిమూలంగా కలిగే పరిణామం ఏమిటంటే— ఏదోవిధంగా భూములు ఎసైన్ అవుతాయనే ఉద్దేశంతో, అక్కడ ఉన్న ఎంక్రోచర్స్ చాలా డబ్బు వెచ్చించి వాటిని బాగుచేయించటం జరుగుతున్నది. కాబట్టి ఎవిక్షన్ ఆర్డర్స్ జారీచేసేముందు కనీసం డిప్యూటీ కలెక్టర్ హోదాలో ఉన్న ఆఫీసర్ ఇన్స్‌పెక్ట్‌చేసి "ఇది తప్పనిసరిగా అబ్‌జక్షనబుల్" అని నిర్ణయించినపుడు, ప్రభుత్వం ఎవిక్షన్ ఆర్డర్స్ జారీచేయాలితప్ప, ఇష్టంవచ్చినట్లు ఆర్డర్స్ జారీచేయటం సరైంది కాదు. ఎవరో రెవిన్యూ ఇన్స్‌పెక్టర్ ఏదో వ్రాస్తే, దానిని చూడకుండా తహశీల్‌దార్ ఎండార్స్ చేస్తే, దానిమీద ఆధారపడి యీ ఎవిక్షన్ ఆర్డర్స్ జారీచేస్తేమటుకు, పేదప్రజలకు ఇబ్బంది కలుగుతుందని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను.

ఈ సందర్భములో మరొక ముఖ్యమైన విషయము ప్రభుత్వం దృష్టికి తెస్తున్నాను. ఇందాక కోటిరెడ్డిగారు కూడ చెప్పారు. కొన్ని చోట్లలో పెద్ద పెద్ద భవనములు చాలా డబ్బు ఖర్చుచేసి నిర్మించారు. ఈ రోజున తహశ్సీలుదారు వచ్చి eviction notice అని అంటున్నారు. తహశ్సీల్‌దారు వద్దనుంచి యిప్పుడు ఉన్న చట్టము ప్రకారము ఆరవ సెక్షను క్రింద Eviction Notice యివ్వగానే దానికి బహుశ మొదటి అప్పీలుకు డిప్యూటీ కలెక్టరు వద్దకు పోవలసి ఉంటుంది First appeal Deputy Collector వద్దకు, second appeal Collector వద్దకు పోవాల్సి ఉంది. దానిమీద Revision Petition ను Revenue Board కు, further Revision Petition గవర్నరుకు పెట్టుకోవాలి. ఈ మధ్య గవర్నమెంటు లెవెల్‌లో appeal దాఖలు చేయగా, తహశ్శీలుదారు ఇచ్చిన eviction order మీద stay ఇవ్వమని అడిగితే, 'ఇచ్చేది లేదు' అని ప్రభుత్వం చెబుతున్నారు. Stay ఇవ్వకపోవడమువల్ల జరుగుతున్న దేమిటంటే, అది నిజముగ Prima facie కేసు అయినప్పటికినీ, Stay మంజూరు చేయటానికి తగిన కారణములు ఉండి, order ఇవ్వటానికి అవకాశములు ఉన్నప్పటికినీ stay ఇవ్వము అని అన్నారు.Stay ఇవ్వకపోవడమువల్ల హెచ్చుగా డబ్బు ఖర్చుచేసి కట్టినవి, ముఖ్యమైనవి పడిపోయి నాశనము కావటానికి అవకాశములు ఏర్పడినవి. ఈ విషయము బహుశ మంత్రిగారికి తెలుసుననుకుంటాను. ఈమధ్య

ఒక **Revision Petition** ప్రభుత్వానికి పెట్టినప్పుడు, చిట్టచివరికి ప్రభుత్వం మంజూరుచేసి శాంక్షను ఆర్డరు ఇచ్చారు. అయితే ఆ ఆర్డరు సకాలములో ఇవ్వకపోవడమువల్ల యీ లోగా ఆ కట్టడములు అన్నీ పడిపోయి నాశనము అయినవి. అటుతరువాత వాటిని పీకివేశారు. కాబట్టి ప్రభుత్వంవారు మొట్ట మొదట ఏ ఉద్దేశ్యముతోనైతే వారికి **assignment** చేశారో ఆఉద్దేశ్యము మటుకు ఇక్కడ సక్రమంగా నెరవేరడము లేదని మనవి చేస్తున్నాను. అందువల్ల ఏదైనా ఒక **Revision Petition** గాని, **Appeal** గాని దాఖలు చేసినప్పుడు, అది **Prima-facie** కేసుగా ఉండి, దానిని **admit** చేసుకోటానికి సరైన కారణములు ఉన్నవని ప్రభుత్వం కాని, ప్రభుత్వాధికారులు గాని భావించినప్పుడు, ఎంతో కాలము క్రింద ఇచ్చిన **Proceedings** అమలు పరచకుండా కాలయాపనచేస్తూ, చివరికి **appeal** కు వస్తే **stay order** ఇవ్వకపోతే, వారు పెట్టుకునే **appeals** వల్ల ఏ విధముగాను ఎక్కువ ఉపయోగము లేదని నేను ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను.

ఇదిగాక ఇంకొక విషయము ఉన్నది. ఇటీవల ప్రభుత్వంవారు 1142 వ నెంబరుగల జి. ఓ. ను ప్యాసుచేశారు. దాని ప్రకారము ఆక్రమణలు చేసినవి ఆక్షేపణకరము అని చెప్పి ఆక్రమణలనుంచి తొలగించమని ప్రభుత్వమువారు ఆర్డర్లు ఇచ్చారు. కాని అక్కడ యీ **Evictions** వల్ల **affect** అయ్యేవారు ఎవరెవరంటే ముఖ్యంగా హరిజనులు, తదితర భూములు లేనటువంటి పేదవారు. అలాంటి పేదవాళ్లను ఆ ఆక్రమణలనుంచి తొలగిస్తున్నారు. వీళ్లను తప్ప ఆవిధము ఆక్రమణలు జరిపిన పెద్దపెద్ద భూస్వాములు, పలుకుబడి కలవారు చాలామంది ఉన్నారు. అలాంటి వారిని తొలగించటానికి ప్రభుత్వం సరైన చర్యలు తీసుకోవడము లేదు. ఇలాంటివి జరగడమువల్ల ప్రభుత్వానికి నేను ఒక సూచన చేస్తున్నాను. ఎవరెవరైతే ఏ ఏ ప్రాంతాలలో, అది తాలూకావారీగా కాకపోయినను జిల్లావారీగా అయినా ప్రభుత్వమువారు ఇచ్చిన **definition** ప్రకారము పెద్దపెద్దవారు కానివ్వండి, మరెవ్వరైనా కానివ్వండి అయిదు ఎకరాలకు మించిన భూములు ఆక్రమించి సాగుచేస్తున్నవారు ఎక్కడెక్కడైతే వున్నారో ఆవివరాలు అన్నీ **perodical reports** ద్వారా ప్రభుత్వానికి పంపిస్తే, **periodical** గా ఎన్ని **evictions carry out** చేస్తున్నారో ప్రభుత్వానికి తెలియగలదు. అలాంటి **information** అంతా ప్రభుత్వం తెప్పించుకొని ఈ విషయమును హరిజనులకు, పేదవాళ్లకు సహాయపడేటట్లుగా పరిష్కరిస్తే బాగా ఉంటుందని మనవి చేస్తున్నాను. తరువాత పెద్దపెద్ద వాళ్ల ఆక్రమణలో ఉన్న భూములన్నీ కొల్పించి, పేదవాళ్లకు **assign** చేసే విషయములో ప్రభుత్వం జాగ్రత్తగా ఆలోచించవలసిన అవసరమున్నదనికూడ మనవిచేస్తున్నాను. జిల్లాలలో జరుగుతున్న ఈ **evictions**

విషయాలన్నీ ప్రభుత్వం దృష్టికి తెచ్చినప్పుడు, ఇందులో పేదవాళ్లు, హరిజనులే ఎక్కువగా ఈ evictions వల్ల బాధపడుతున్నారు. పెద్దపెద్దవాళ్లు తప్పించుకుంటున్నారని ప్రభుత్వానికి హెచ్చరిక చేస్తున్నాను ఈ మధ్యనే ఒక గ్రామములో కొన్ని evictions విషయములో ఒక Revision పిటిషను నలభైమంది పేదవాళ్లు పెట్టుకోవలసి వచ్చినప్పుడు stamp duty ఎక్కువగ పెట్టుపోలేక అందరు కలిసి ఒకటే Common Petition draft చేయించుకొని పెట్టుకుంటే, అది పనికిరాదు, వేరే పిటిషనులు పెట్టుకోవాలని చెప్పారు. దానివల్ల 50, 60 రూపాయలదాకా stamp duty పెట్టుకోవలసి వచ్చింది. ఈ stamp duty యీ పేదవాళ్ళకు ఎంతో భారమై పెట్టుకోలేని స్థితిలో ఉన్నారు. Stamp duty నుంచి వారిని exempt చేయడము అనేది ప్రభుత్వానికి ఎక్కువ సంగతిలో చేరిందికాదు. ఈ నాడు క్రిమినల్ కేసుల విషయములో కూడ convicts కు appeal చేసుకునే వ్యవహారములో stamp duty లేకుండా చేశారు. అదేవిధముగ యీ landless labourers పెట్టుకునే పిటిషనుల విషయములో appeals కు గాని, Revision Petitions కు గాని stamp duty లేకుండాచేస్తే బాగుంటుందని సూచిస్తున్నాను. ప్రభుత్వానికి యీబిల్లు విషయములో అవసరమని తోస్తే, దీనిని Select Committee కి పంపించమని కోరుతూ ఇంతటితో సెలవు తీసుకుంటున్నాను.

మిస్టర్ స్పీకర్ : ఈ బిల్లు విషయములో Public opinion కొరకు పంపించడము అక్కర లేదనుకుంటాను. దీనిని సెలెక్టు కమిటీకిపంపే ధోరణియే కనబడుతున్నది.

* శ్రీ కె. నరసయ్య (సిరిసిల్ల-రిజర్వుడు): అధ్యక్షా! ఈ బిల్లు యొక్క ఉద్దేశ్యమును చూస్తే యిక్కడ ఉన్న శాసన సభ్యుల మందరము దీనిని పరిశీలించే ముందు ఏ ఏ ప్రజారంగములోనైతే మనము ప్రచారము చేసుకుంటూ రాష్ట్రములో ఉన్న ప్రజల బాధలు, కష్టములు తెలుసుకుంటూ వస్తున్నామో మనకు తెలుసు. మన కాంగ్రెసు ప్రభుత్వము, కమ్యూనిస్టు పార్టీ, Socialist Party ఏ ఏ సమస్యలు అయితే main points గా తీసుకొని పూర్వము నైజాము ప్రభుత్వానికి వ్యతిరేకముగా అందులో ముఖ్యంగా ఉన్న వెట్టి చాకిరిని గురించి, భూసమస్యను గురించి ప్రచారముచేసి, అవి అన్నీ తీసుకొని వచ్చి ఈ ప్రభుత్వానికి అందించి అవి తీసివేయాలని ప్రచారముచేస్తున్నామో, వాటియొక్క ఉదాహరణలు ఎన్నో మన సభ్యుల హృదయాలలో ఉన్నవని నేను భావిస్తున్నాను. అయినప్పటికినీ మనకు కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడి యిప్పటికి పది సంవత్సరాలు కావచ్చింది. ఇప్పటికి 20, 30 సంవత్సరాలుగా గ్రామ సీమలలోని హరిజనులు గాని, పేద ప్రజలుగాని, వెనుక బడిన జాతుల వారుగాని ఫోరంబోకు భూములు,

బంజరు భూములు సాగుచేసుకుంటున్నారన్న సంగతి మనకందరికీ తెలియక పోలేదు. ఇన్ని సంవత్సరములుగా లేనటువంటి చట్టములు ఈ దినము ప్రభుత్వము లేనిపోని చట్టములు. సవరణలు తీసుకుని వస్తున్నందువల్ల, వీటిని భూస్వాములు, గ్రామ పెత్తందార్లు ఆస్కారముగా చేసుకుని, పేదవాళ్ళను ఆ భూములను సాగుచేసుకో నివ్వంకుండా ఆటంకములు కలుగ జేస్తూ వాళ్ళను తొలగిస్తూ అనేక యిబ్బందుల పాలుచేస్తున్నారు. వాళ్ళను బాధించటానికి యీ చట్టములను భూస్వాములు, పెత్తందార్లు ఆయుధములుగా ఉపయోగించుతున్నారు. ఈ చట్టములు పేదవాళ్ళను బాధించటానికి పనికి వస్తున్నవే కాని, వాళ్ళకు ఏవిధముగాను లాభించడములేదు. మొట్టమొదట ఈ చట్టమును మేము వ్యతిరేకిస్తున్నాము. అయితే మన కాంగ్రెసు ప్రభుత్వము, సంజీవరెడ్డిగారి ప్రభుత్వము "మేము భూసంస్కరణలు తీసుకుని వస్తున్నాము, దున్నుకునే వారికే భూములను ఇస్తాము అని చెప్పి ఒక ప్రక్కన ప్రచారముచేస్తూ ఈలాంటి చట్టములు తెచ్చినప్పుడు ఇక ముందు ప్రజలవద్దకు పోయి అలాంటి విషయములు చెప్పటానికి అర్హత ఉంటుందా, అని యీ బిల్లువల్ల స్పష్టమగు చున్నది. ఇంతే కాకుండా తహశీలుదారు కచ్చేరిలలోను, జిల్లా కలెక్టరు ఆఫీసులలోను పెద్ద పెద్ద అక్షరములతో దున్నేవాడికే భూమిఅని, పోరంబోకులు, బంజర్లు వగైరా భూముల పట్టాలను యిస్తున్నాము" అని వ్రాసి బోర్డులు తగిలించి యున్నారు పైగా ఈ భూములు హరిజనులకు పేదవారికి యిచ్చి సహాయము చేస్తున్నాము అని చెప్పుకునే ఈ ప్రభుత్వము పేదవాళ్ళను అమాయకత్వములో పడవేశారు. కాని యీలాంటిది కాకుండా పేదవాళ్ళకు భూములు పట్టాలకు యిచ్చే సవరణ బిల్లును తీసుకుని రావటానికి ప్రభుత్వం పూనుకుంటుందని ఆశిస్తున్నాను. ఈ మధ్యన గ్రామ సీమలలో పటేల్ పట్వారీలు భూములు యివ్వటానికి ఆర్డర్సు వచ్చినవని చెప్పి ఎకరము ఒకటింటికి అయిదేసి రూపాయాలు వసూలుచేసి కష్ట పెట్టారు. ఈ విధముగ చేయడమువల్ల ఒక్కొక్క గ్రామము నుంచి 50,100, 150 మంది పేద ప్రజలు మేము ఈ తహశ్శీలు కట్టలేము, యిది తీసివేయమని చెప్పుకోటానికి ఆఫీసుల వద్దకు వెళ్ళారు. తీసివేయక పోతే మేము యిక్కడనే సత్యాగ్రహము చేస్తామని చెప్పుకున్నారు. మాకు సగము పంట అయినా పండలేదు. ఈ తహశ్శీలుకు సరిపడే పంట కూడ పండలేదని చెప్పుకున్నారు. మీరు మమ్ములను ఏమి చేసినా సరే, మేము సిద్ధముగా ఉన్నాము. తహశ్శీలు తగ్గించండి అని చెప్పారు. అక్కడ ఆఫీసుల వారి వద్ద సమాధానము రాకపోతే చివరికి యిక్కడ మంత్రిగారి సమక్షమునకు చెప్పుకుందామని రావటానికి సిద్ధముగా ఉన్నారు. మా ఆఫీసుకు గూడ వచ్చి అందోళన చేశారు. దాని మీద రాజేశ్వరరావుగారు, ఎల్లారెడ్డిగారు మంత్రి కళావెంకట్రావుగారి వద్దకు రాయబారము

వెళ్ళారు. "వారు వచ్చిన తరువాత ఏమి చేయవలసిందిన్నీ చెబుతాము. అప్పటివరకు ఆగండి. వారు వచ్చిన మీదట సంగతి సందర్భాలు చూచుకుని ఆలోచించుదామ"ని చెప్పి పంపాము. తరువాత వారిద్దరువచ్చి చెప్పిన దానిని బట్టి, మేము ఏదో ఆర్డర్సు పంపుతాము అని చెప్పినప్పటికిన్నీ, ఈలోగా ఏదో ఆర్డినెన్సో, మరేదోరాగా అది యీ భూముల విషయము కాదని తెలిసిన తరువాత మరల పెద్ద ఆందోళన సాగించారు. దాని మీద మరల మంత్రిగారి వద్దకు రాయబారము వెళ్ళారు. ఈ విధముగ మంత్రిగారి వద్దకు ఎన్నిసార్లు రాయబారము వెళ్లినను, ప్రయోజనము కన్పించలేదు. పేదవాళ్ళు, భూములు సాగుచేసుకుని జీవించుతూంటే, వారిని తొలగించే ప్రయత్నములు జరుగుతున్నందువల్ల వారు ఎన్నో కష్టముల పాలగుచున్నారు. ఈబిల్లు పోరంబోకు భూములు దున్నుకునే పేదవారికి, హరిజనులకు ఉపయోగించదు గనుక, ఇది మంచి బిల్లు కాదని మనవిచేస్తున్నాను. పేద వాళ్ళకు భూములు యిచ్చి సహాయము చేయాలి. ఆ విధముగ చేస్తేనే, యిది ప్రజా ప్రభుత్వం అనిపించుకుంటుంది. మొన్న యీ మధ్య మన విద్యాశాఖ మంత్రిగారు అక్కడ కేరళలో చేసిన బిల్లుల కంటే మనము మంచి బిల్లును తెస్తూ, ప్రజలకు సహాయ పడుతున్నాము. కేరళతో పోటీచేస్తున్నామని చెప్పిన సంజీవరెడ్డిగారి మంత్రివర్గానికి చెబుతున్నాను. కాబట్టి ఇలాంటి బిల్లులవల్ల ఏమీ లాభము లేదు. కాబట్టి పేద ప్రజలకు సహాయ పడి కాంగ్రెసు ప్రభుత్వం సంపాదించుకున్న ప్రతిష్టను, గౌరవమును నిలబెట్టు కోటానికి ప్రయత్నిస్తేనే, యిక ముందు అయినా యీ ప్రభుత్వానికి స్థానము ఉండ గలదు. లేకపోతే ఉండబోదని గుర్తించాలి. ఈ ప్రభుత్వములోని మంత్రి వర్గము మరల ప్రజలవద్దకు పోయి చెప్పుకోటానికి అర్హత, బాధ్యత ఉండేటట్లు చేసుకోటానికి పూచీ తీసుకొని, సరైన విధానాన్ని అవలంబిస్తారని ఆశిస్తూ, ఇంతటితో విరమిస్తున్నాను.

* శ్రీ జి. నాగేశ్వరరావు (రాజోలు - రిజర్వుడు) : అధ్యక్షా ! ఈ బిల్లును ప్రతిపాదించిన తరువాత ప్రభుత్వముయొక్క విధానము ఏ విధముగా ఉన్నదో దీనివల్ల బాగా బోధపడుతున్నది. బంజరుభూములు, పోరంబోకులు, అభ్యంతరము లేనటువంటి బంచరాయి భూములు, లావుని భూములు అన్నింటి విషయములును యీనాడు ప్రభుత్వము ఇచ్చిన eviction orders వల్ల రాష్ట్రములో ఎంతో పెద్ద ఆందోళన బయలుదేరింది. ఇప్పటికి 20, 30 సంవత్సరాలుగా పేదప్రజలు, హరిజనులు యీ భూములను సాగుచేసుకొంటున్నారు. ఆ విధము సాగుచేసుకొంటున్న పేదవాళ్లమీద హెచ్చుగా penalties వేయడముగాని, పండినపంట వేలము వేయడముగాని జరుగుతూవస్తున్నది. ఇంతకాలముగా సాగుచేసుకుంటున్న యీ భూములకు పట్టాలు అయినా యివ్వలేదు. పోనీ లీజుకు యిచ్చేపద్ధతిఅయినా చేయ

లేదు. ప్రతి సంవత్సరము సాగుచేసిన భూములమీద హెచ్చు పెనాల్టిలు విధించి పేదవాళ్లను అనేక యిబ్బందులకు, బాధలకు గురిచేస్తున్నారు.

అయితే మన ఆంధ్రలోగాని, తెలంగాణాలోగాని ఇంతకాలంగా ఎంతో తీవ్రమైనటువంటి ఆందోళన జరుగుతున్నప్పటికి బంజరు భూముల సాగు విషయంలోను, వ్యవసాయ కూలీలు సాగుచేసుకొనే భూముల విషయంలోను ఒక ప్రధానమైన మార్పు కూడా మన ప్రభుత్వం యింతవరకు తీసుకురాలేకపోయింది. ఆంధ్ర అసెంబ్లీలో అభ్యంతరంలేని పోరంబోకులను బంజరు భూములను భూములు లేని పేదవారికి పంచాయితీలను తీర్మానం అంగీకరించిన తరువాత కూడా ప్రభుత్వం ప్రధానమైన మార్పు తీసుకురాలేకపోయింది. మన ఆంధ్రప్రదేశ్‌లో నూటికి 75 మంది పేదవాళ్లుగా ఉండి, భూములులేని కూలీలుగా ఉండి బంజరు భూములు ఆక్రమించుకొని సాగుచేసుకుంటూ సతమతమై పోతున్న పేద ప్రజానీకం విషయంలో ఒక ప్రధానమైన మార్పును తీసుకురావడానికి ప్రభుత్వం ఫెయిల్ అయినదని మనవి చేస్తున్నాను. అభ్యంతరం లేని భూములలో పేద ప్రజానీకానికి పట్టాలు యిచ్చి అభివృద్ధికరమైన కార్యక్రమాన్ని అవలంబించడం పోయి, చాల కాలంగా ఆందోళన జరుగుతున్న ఈ సమస్యమీద అభివృద్ధి నిరోధకమైన విధానాన్ని ఈ రోజు ఈ అమెండ్‌మెంట్ ద్వారా అవలంబించారని ఋజువు అవుతున్నది. అది లైసెన్సు యివ్వబడిన భూమి అయినప్పటికి, బీజుకు యిచ్చిన భూమి అయినప్పటికి అది అభ్యంతరం లేని భూమి ? ఆ భూమి మీదకూడా అసలు దాని మీద విధించబడిన ఎసెస్‌మెంట్‌కు రెట్టింపు ఎసెస్‌మెంట్‌కు విధించడానికి ఒరిజినల్ యాక్టును సవరణచేస్తున్నారు అంటే, పేదవాళ్లమీద యింకా పన్నులు రెట్టింపుకు రెట్టింపువేసి వాళ్లను బాగా పిండి వసూలుచేయడానికి ఈ సవరణ బిల్లు అవకాశం యిస్తున్నది. అభ్యంతరం అయిన పోరంబోకు భూములమీద 20 రెట్లు యిప్పటికి వేస్తున్నారు. కేసులు పెడుతున్నారు. సంవత్సరం పొడుగున కష్టపడి పండించిన ధాన్యాన్నంతా కూడా వేలంవేసి ఆ పంట తీసుకుంటున్నారు. ఏ నాడో చేసిన పాత చట్టాన్ని అవకాశంగా తీసుకుని గ్రామాలలో ఏభూమి ఎంతవరకు అభ్యంతరం అయినది, ఎంతవరకు అభ్యంతరం లేదు అనేది పరిశీలించకుండా భూములు లేని ప్రజానీకానికి ప్రభుత్వం అన్యాయం చేస్తున్నది. ఇప్పటికీ ఆ అన్యాయాన్ని గుర్తించకుండా దానిమీద పన్ను ఎక్కువ చేయడం, వాళ్లందరిని బాధపెట్టి భూములనుంచి తొలగించడానికి యీ సవరణబిల్లు ఉద్దేశిస్తున్నది. ఇంతవరకు ఎవిక్షన్ కార్యక్రమం జరిపించడానికిగాని వేలం వేయడానికిగాని, పెనాల్టీలు వేయడానికిగాని ఆర్. డి. ఒ. గారికే అధికారం ఉన్నది. ఇప్పుడు తాశిల్దారుకు కూడా ఆ పవర్ యివ్వడం మూలంగా తాలూకాలో ఉండే పెత్తనదారులు పెద్ద పెద్ద భూస్వాములు పేద ప్రజలకు వ్యతిరేకంగా అడ్డువచ్చి, అవకాశం ఉన్నంతవరకు వారే ఆక్రమించుకొని

ఉద్యోగస్థులను ఇన్‌ఫ్లుయన్స్ చేసుకుని వాళ్లమీద పెనాల్టీలు వేయించడం, ఎవిక్షన్ చేయించడం మొదలైన ఎన్నో బాధలకు గురిచేస్తున్నారు. ఇటువంటి పెత్తనదారీ వర్గానికి బాగా అవకాశం యిచ్చేందుకే తాలూకాలలో తాశిల్దారుకు ఈ అధికారాన్ని కట్టబెడుతున్నారు. ప్రభుత్వం యొక్క ఉద్దేశ్యం యిదేననే నా అభిప్రాయం. ఒరిజినల్ యాక్టులో కొన్ని ప్రధానమైన మార్పులు అభివృద్ధికరమైన మార్పులు తీసుకురావడానికి బదులు అభివృద్ధి నిరోధకమైన పద్ధతులు అవలంబించి రోజురోజుకు ప్రభుత్వం దిగజారి పోతున్నది. పేద ప్రజల తిండి తిప్పలకు సంబంధించినంతవరకు, వాళ్లు సాగుచేసుకునే భూమికి సంబంధించినంతవరకు, ముఖ్యంగా భూముల విషయంలో తప్పకుండా ప్రభుత్వం ఈ అమెండింగ్ బిల్లును ఉపసంహరించుకోవాలి. 10, 15 సంవత్సరాల నుంచి Grow more food క్రింద సాగుచేస్తున్న భూములు ఆంధ్రప్రదేశ్‌లో ఎన్నో ఉన్నాయి. వందలాది ఎకరాలు అప్పుడు పేద ప్రజలకు యిచ్చారు. ఆ భూములకు ఇప్పటికి కూడా అభ్యంతరం అని చెప్పి రెట్టింపుకు రెట్టింపు పెనాల్టీలు చేస్తున్నారు Grow more food క్రింద యిచ్చిన భూములలో నుంచి వెళ్ళగొట్టిన ఘటనలు అనేకం ఉన్నాయి. వెళ్ళగొట్టకుండా 20 రెట్లు పెనాల్టీలు వేసిన ఘటనలు కూడా ఉన్నాయి సెంటుకు రూపాయి, రు. 1-4-0, చొప్పున 80 ఎకరాలు సాగుచేస్తుంటే 8 వేలరూపాయలు వేసిన ఘటనలు కూడా ఉన్నాయి. కొత్తపేట తాలూకాలో. నేను ఎఱుగున్నంతవరకు. ఇలాంటి ఉదాహరణలు అనేకం ఉన్నాయి. ఆ భూములను 10, 15 సంవత్సరాల నుంచి సాగు చేస్తున్నారు. అభ్యంతరం లేని భూములు అవి. ప్రభుత్వం పాత చట్టాన్ని తీసుకొచ్చి మెకానికల్‌గా దీనికి అప్లైచేసి గుడ్డితనంగా పోతోందే తప్ప పీళ్ళందరికి సాగుచేసుకోడానికి భూమి యిద్దాం, ఆర్థికంగా కాస్త లాభం కలుగ చేద్దాం, ఇంత కాలంగా ఉన్న సమస్యను పరిష్కారం చేద్దాం అనే అభిప్రాయం గవర్నమెంటుకు లేదు. ఇంత ఆందోళన జరుగుతున్నప్పటికి, గత అసెంబ్లీలో ఒక తీర్మానాన్ని ఆమోదించి నప్పటికి కూడా, గవర్నమెంట్ సైడ్ నుంచి గౌరవ సభ్యులు ఎంతోమంది చెపుతున్నప్పటికి కూడా ప్రభుత్వం ఏదో ఒక గుడ్డి విధానాన్ని అవలంబించుతూ పోతున్నది. Encroachment Act విషయంలో పాత చట్టాన్ని అభివృద్ధికరంగా మార్చాలని, ప్రభుత్వం దీనిని ఉపసంహరించుకోవాలని కోరుతున్నాను.

* శ్రీ ఎన్. శ్రీనివాసరావు (తాడేపల్లిగూడెం - రిజర్వుడు): అధ్యక్షా! ఈ బిల్లుపైన చాలమంది సభ్యులు మాట్లాడిన తరువాత కొంతవరకు ప్రభుత్వం దీర్ఘంగా ఆలోచించి ఏదైనా చేయాలనే అభిప్రాయం వారికి ఉంటేనే తప్ప మిగతా సభ్యులు మాట్లాడినా కూడా ప్రయోజనం ఉండదేమో ననిపిస్తుంది.

" తేజువులు అందలంబులు జవు జవు
మాత్రంబె కాని క్షుధ తీరేనా,
రాజీవాక్షులకైన భోజనమే
జగతికల్ల బొంతల మల్లా"

అన్న పద్యం కళా వెంకటరావు గారికి తెలియనిదికాదు. కళా వెంకటరావుగారు ఏదైన చేయదలచుకున్నట్లయితే దానిని త్వరగా చేయగలరు. సమర్థించ గలరు. మా అందరికంటె పెద్దవారుగా ఉండి, దేశంలో ఉండే పేదవాళ్ళకు సేవ చేయా లనేటటువంటి ఉద్దేశం కలిగి జాతీయ భావాలు కలిగినటువంటివారు—ఏదో స్థానికంగా నాబోటివాడి పైన కోపమో మరింకెందుకో తెలియదు కాని—పేద వాళ్ళకు సహాయము చేయడమనేది వారి శక్తికి మించిన పని కాదు. భారత దేశంలో ఉన్నటువంటి హరిజనులకు పేదవాళ్ళకు సేవ చేయాలనే సంకల్పంతో మహాత్మాగాంధి శంఖారావం పూరించినప్పుడు ఉన్న ఆ నాటి ఉత్సాహం, ఆ నాటి దీక్ష, ఆ నాటి పల్లె ప్రజలకు చేసినటువంటి సేవ నేడు సన్నగిల్లుతోందా అనేటటు వంటి విషయం ఆలోచించినప్పుడు ఎంతో దుఃఖకరంగా ఉంటుందని మనవి చేస్తున్నాను. ఈ వేళ దేశంలో ఉన్నటువంటి పేదరికాన్ని గురించి ఒక గంట కాదు. ఎన్ని గంటలు చెప్పమన్నా చెప్పడానికి తగినంత వస్తువాహనాలు, సాక్ష్యాలు ఉన్నవి. అది అందరికి తెలిసిన విషయమే. ఈ నాడు అట్ట అడుగున ఉన్నటువంటి పేదప్రజలు, ఆహారోత్పత్తి చేస్తున్నటువంటి వ్యవసాయ కూలీలు ఏదోబంజరు భూమి – లైసెన్స్‌దో, అన్‌లైసెన్సుదో - తీసుకుని భార్యాబిడ్డలు శ్రమించి, దేశానికి ఆహారం పెట్టాలనేటటువంటి పేదలపైన ఈ రకమైనటువంటి కక్షవహిస్తున్నారా? అనేటటువంటి భావం రావడమనేది మాత్రం చాల విచార కరం. మనం అనుకున్నటువంటి Socialistic Pattern of Society కి వెళ్ల డానికి యిదే మార్గమా? ఈ మార్గంలోనే మనం ప్రయాణం చేసినట్లయితే ఆ ధ్యేయానికి చెరుకుంటామా? ఈ విషయం గాంధీ గారికి ఏ స్పుత్నిక్‌లోనో పెట్టి పంపిస్తే ఆయన దుఃఖిస్తాడా లేక దీనిని అభినందిస్తాడా అనే అంత తీవ్రంగా కూడా ఆలోచించవలసినటువంటి విషయంగా ఉంటుంది.

" ఆకలి గొన్నవాడు ఎఱుగు ఆకలి బాధ,
సమస్త ద్రవ్యములు పీకకు మెక్కి
త్రేవ్‌మన త్రేన్పెడివాడు ఎఱుంగ
నేర్చునే ఆకలి బాధ."

గుడ్లు పైకొచ్చే వరకు గులాబ్‌జామ్, ఆయాసం వచ్చే వరకు పాయసం తినేటటు

వంటి వాడికి తిండిలేనటువంటి వాని బాధ ఏమి తెలుస్తుంది? వాడు ఏ–ist అన్నా కానివ్వండి నేను అంటాను "పొట్టిస్ట్" అని పొట్టకు తిండి లేకుండా ఆ -ism, ఈ ism అని గాలిలో మేడలు కట్టి ఏమీ ప్రయోజనం ఉండదు. అందుచేతనే కర్నూలులో అన్ని పార్టీలవారు కలిసి బంజరు భూములు పేదలకు యివ్వాలని unanimous గా — వారివారి రాజకీయ అభిప్రాయ భేదాలు ఏమి ఉన్నప్పటికి —ఒక తీర్మానం pass చేశారు. దాని మేరకు కొంతవరకు ఆయా తాలుకాలలో ప్రధానంగా పశ్చిమ గోదావరి జిల్లాలో, నా నియోజకవర్గంలో కూడా కొన్ని వేల ఎకరాలు పంచారు. దానికి నేను ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను. గుంటూరు జిల్లాలో చూసినట్లయితే ధనాఢ్యుల చేతులలో 22 వేల ఎకరాలభూమి encroachments ఉన్నవని రాజకీయ బాధితుల కమిటీ లెక్కలు సేకరించి ప్రభుత్వం దగ్గరకు తీసుకొచ్చి పెట్టారు. అటువంటప్పుడు యివ్వాళ రాజకీయ బాధితులకు భూమి యివ్వాలి అంటే పేదవాడి భూమి ఎందుకు యివ్వాలి. ధనాఢ్యుల దగ్గర ఉండే టటువంటి 22 వేల ఎకరాల భూమి ఎందుకు evict చేసి యివ్వలేదు. అలా యివ్వ డానికి ప్రభుత్వానికి శక్తిలేదా? అనేక ఘన కార్యాలు చేయడానికి, అనేక విష యాలు సాధించడానికి స్తోమతు కలిగినటువంటి ఈ ప్రభుత్వం కనీసం బాగా ధనాఢ్యులైనటువంటి వారిచేతులలో ఉన్నటువంటి 20, 30, 40, 50 ఎకరాలభూమి వారి encroachment లో నుంచి తొలగించకపోతే మనం ఏమిచెయ్యలేము. ఈ దేశంలో ఏ plan కూడా శాశ్వతంగా విజయవంతం కాదేమోననేటువంటి భయం వస్తున్నది.

"ఎన్నికల సందర్భంలోనూ, ఓట్ల విషయంలోనూ మీ హరిజనులు మాత్రం సరిగా ప్రవర్తించారా" అంటారేమో! నిజమే కాని "బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య.........ద్విజాతీయా, చతుర్థోపక జాతస్థ శూద్రో నాస్తి పంచమ" అన్నట్లుగా బ్రాహ్మణోత్తములుగా, అగ్ర సోదరులుగా ఉంటున్న మీ దగ్గర విద్య నేర్చుకున్నవారిలో ఉండే లోపాలకంటే, మీ దగ్గర, మీ యనుచరుల దగ్గర నుంచి నేర్చుకున్న మాలో ఎక్కువ లోపాలుండడానికి అవకాశం ఉన్నది. మాకు విజ్ఞానంలేదు. దరిద్రం ఎక్కువ. డబ్బు, ఆశ ఎక్కువ. పదవీ వ్యామోహం ఎక్కువ. ఇవి పేదవానికి, ఆకలిగొన్నవానికి తప్పకుండా ఉంటుంది. ఏదో, ఒకరో, ఇద్దరో ఓట్లు వేయలేదనే కారణం చేతనో, సభ్యతగా మాట్లాడ లేదనే కారణం చేతనో, ఇంకా ఇతర కారణాల చేతనో...

మిస్టర్ స్పీకర్ : ఇప్పుడు ఓట్ల విషయం తీసుకురావద్దు. ఓట్లకు ఇక్కడ సంబంధం లేదు.

శ్రీ ఎన్. శ్రీనివాసరావు : మనదేశం యొక్క జాతీయ ప్రణాళికలను సక్రమంగా సాగించి, అభివృద్ధిలోకి రావాలంటే నేను చెప్పిన విషయాలన్నీ సుహృద్భావంతో ఆలోచించాలి నేను ఈసందర్భంలో 1, 2 విషయాలు చెప్పి సెలవు తీసుకొంటాను.

(1) ఈనాడు మన ప్రభుత్వం భూసంస్కరణలను తీసుకురాబోతున్నది. అట్లా తీసుకు రాబోయేముందుగా, ప్రస్తుతం available గా ఉన్నభూములను Landless Poor కు వారు హరిజనులైనా, మిలిటరీ వారైనా, రాజకీయ బాధితులైనా...ఇవ్వండి. అసలు available గా ఉన్న భూమి ఎంత? ఉన్న భూమిని తక్షణమే లేనివారికి ఇవ్వాలి. అయోగ్యులకు ఇవ్వవద్దు. యోగ్యులకు ఇవ్వమని మనవి చేస్తున్నాను యోగ్యులకు ఇచ్చి, ఒక permanency ఏర్పాటు చేసినట్లయితే, ఒక ప్రక్కన పేదవారి సమస్య పరిష్కారం అవుతుంది; రెండవ ప్రక్కన ఆహార కొరత సమస్య పరిష్కారం అవుతుంది భూసంస్కరణల చట్టం వస్తే, దాని మీద ఎన్ని Legal aspersions ఉంటాయో, ఎన్ని చిక్కులుంటాయో దాని బాగోగులు ఇప్పుడప్పుడే తెలియవు. ఈతతంగం అంతాజరిగితే ......... ఎప్పటికోగాని ఆహార సమస్య పరిష్కారం కావడానికి అవకాశంలేదు. ఇటువంటి పరిస్థితులలో భూసంస్కరణల చట్టంకోసం ఎదురు చూస్తూ కూర్చోడంవల్ల లాభంలేదు. ఇప్పుడు available గా ఉన్న బంజరు భూములను ముందుగా పంపకం, చేయండి అని హరిజన శాసన సభ్యులతరఫుననే కాకుండా నా వ్యక్తిగతాభిప్రాయంగా అనేకసార్లు చెప్పినాను. భూసంస్కరణల చట్టం తెచ్చి వారిని తొలగించి, వీరిని తొలగించి పేదవారికి ఇద్దామనుకొంటూ ఉంటే...ఈ లోపున వేలు విడిచిన తోటికోడలు బావ మరిది తమ్ముడి పేర, వారి పేర, వీరి పేర అంతా వ్రాసివేయబడి 'నానాటికి తీసికట్టు నాగం భొట్లు' అనేస్థితికి వస్తుంది. భూసంస్కరణలు తెచ్చిన తరువాతనే దాని విషయం ఆలోచించవచ్చు ననుకోండి. ఇప్పుడు మాత్రం, ready గా ఉన్న బంజరు భూములను పేదలకు, హరిజనులకు పంపకం చేయవలసినదిగా కోరుతున్నాను.

సహకారం సందర్భంలో హరిజనులకు సరియైన సహకారం లభించుటలేదు. ఈ విషయమై రాష్ట్రంలో ఉండే వ్యవసాయకుల సొసైటీలన్నీ కలిపి ఒక Financial Corporation ను ఏర్పాటు చేయించవలసినదిగా ముఖ్యమంత్రి గారిని కోరినాయి. ఒకవేళ భూములు ఇచ్చినా, "ఎడ్లు, ఎరువులు, విత్తనాలు మొదలైనవి కొనుక్కోలేని స్థితిలో ఉన్నాము" అని చెప్పుకొన్నారు. ఏవో ప్రణాళికలు వేసికొన్నంత మాత్రాన మన పనులన్నీ విజయవంతం కావడానికి అవకాశం లేదు,

(2) సుమారు 10, 15 సంవత్సరాల నుంచి continuous గా కొంత మంది కూలీల ఆక్రమణలో ఉంటున్నటువంటి భూముల గురించి మద్రాసు ప్రభుత్వంలో ఉండగా కొన్ని G. O. లను pass చేసినారు. భూములను ఇవ్వడంలో హరిజనులకు priority ఇచ్చారు. 1948 వ సంవత్సరానికి ముందు నుంచీ తమ ఆక్రమణలో ఉన్నవారికి ఆ భూములను ఇవ్వాలన్నారు. G. O. లు మాత్రం ఉంటున్నాయి. కాని ఆచరణలో అవి సక్రమంగా అమలు జరుగుట లేదు. ఇది ఎంతో విచారకరమైన విషయం. మన G. O. లను మనమే అమలు జరుపుకో లేకపోతే, మన ప్రభుత్వం నిర్ణయించిన విషయాలను అమలు చేయలేకపోతే ఇక గత్యంతరం ఏమిటి? ఈ విషయాన్ని ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను. సువిశాలమైన భావాలు కలిగిన Cabinet సభ్యులు, ప్రభుత్వ సభ్యులు, ప్రతిపక్ష సభ్యులు...అంతా కలిసి పేదవారికి భూములు లభించే అవకాశం కలుగజేసినట్లయితే, ఆహార సమస్యను పరిష్కరించడానికి మార్గాలు ఏర్పడతాయి. ఇందుకు ప్రయత్నించాలని కోరుతూ, నాకు అవకాశం ఇచ్చిన అధ్యక్షుల వారికి అభినందనలు తెలుపుతూ ముగిస్తున్నాను.

మిస్టర్ స్పీకర్ : ఇప్పుడు 1-05 నిమిషాలు అయినది. ఇంక 25 నిమిషాలలో సమావేశమును close చేయబోతున్నాము.

శ్రీ బసవ మానయ్య : On a point of order, Sir.

మిస్టర్ స్పీకర్ . మీరు చెప్పిన దానిలో Point of order లేకపోతే మీ మీద action తీసికొంటాను.

అందుకు మీరు సిద్ధంగా ఉంటే అడగండి. అసలు Point of Order అంటే మీకు తెలుసా? Rules కు, గాని, Constitution కు గాని ఏదైనా వ్యతిరేకంగా జరిగినట్లయితేనే Point of Order అవుతుంది. General గా అక్కడ అన్యాయం జరిగింది, ఇక్కడ అన్యాయం జరిగింది అనేది రాకూడదు. జ్ఞాపకం పెట్టుకోండి. లేకపోతే నేను ఏదైనా చేసిన తరువాత బాధపడతారు.

శ్రీ బసవ మానయ్య : అధ్యక్షా ! తమరు ఎట్లు శిక్షించిననూ నేను సిద్ధంగా ఉన్నాను.

తమ యొక్క దృష్టిని నేను 28-2-58 వ తేదీన పంపించిన నోటీసుకు మరల్చ దలచినాను. Land Encroachment Act ను Public opinion కు పంపించాలని నేను ఆ నోటీసులో వ్రాసినాను. సెలక్టు కమిటీకి కూడా నోటీసు పంపినాను. నోటీసు నేను పంపినట్లుగా నా పేరు కూడా వచ్చింది. చీటీ కూడా

వ్రాసుకున్నారు. అయితే, దానిని గురించి మాట్లాడడానికి 5 నిమిషముల time అయినా ఇవ్వలేదు.

మిస్టర్ స్పీకర్ : ఇందులో Point of Order ఏమీ లేదు. మీరు Point of Order అన్నారు కనుక ఈ వేళ, రేపు కూడా మీరు మాట్లాడడానికి అవకాశం ఇవ్వను. దీనికి అంతకన్నా వేరే ఏమీ లేదు.

* శ్రీ కె. వెంకటరావు : అధ్యక్షా! దీనిని సెలక్టు కమిటీకి పంపించడానికి నేను అంగీకరిస్తున్నాను. కాబట్టి ఈవేళ దీర్ఘమైన ఉపన్యాసం చేయదలచుకో లేదు. అసలు ఈబిల్లు ఏమిటో, సభ్యులు మాట్లాడినది ఏమిటో ఈరెండూ నాకు అర్థం కాలేదు. "ప్రభుత్వంవారి భూములను అధికారం లేకుండా ఎవరైనా ఆక్ర మణచేసికొంటే ఏరకమైన చర్యలు తీసికోవాలి" అనేది అసలు బిల్లులో ఉన్న విషయం. ఇక్కడ చాలామంది, ప్రభుత్వ భూములను ఎటువంటి వారికి, ఏరకంగా ఇవ్వాలి అనీ assignment policy గురించి మాట్లాడారు. Encroachment అన్నారు. సందు దొరికింది కదాయని దీనిమీద కూడా ఒక రాయి విసరినారు. వారి మనస్సులలో ఉన్న బాధనంతా పైకి చెప్పారు. Assignment Rules House ముందుకు వచ్చినప్పుడు అవకాశం చిక్కుతుందో, లేదో యని ఈనాడే కవిత్వం దగ్గరనుంచీ, పద్యాలు, పాటలదాకా...అక్షయ పాత్రదగ్గర నుంచి... ఈ వ్యవహారం వెళ్ళిపోయింది. వారు అనుకున్న పనులు జరగడం లేదని ఎవరి కైనా కష్టం కలుగవచ్చును. కాని, అదంతా తీసుకువచ్చి ఈవేళ ఉపన్యాసాలు చెప్పడంలో న్యాయంలేదు. అటువంటి వాటికి సమాధానం చెప్పడం వల్ల నాకు గౌరవస్థానం తగ్గుతుందేమో అనుకొంటున్నాను. (Interruption from Sri V. Kurmayya ). నా ఇష్టం వచ్చినప్పుడు తీసుకు వస్తాను. దీనికి ఒక Order ఏమీ వ్రాసిపెట్టలేదు. Land Encroachment Act 1953 సంవత్సరం నుంచి అమలులో ఉన్నది. అప్పుడు నా మిత్రులు మంత్రులు కూడా. దీనికి Amend-ment పెట్టాలనే కోరిక వారికి ఉన్నట్లు ఎప్పుడూ తెలుపలేదు, సూచించలేదు. అప్పుడు వారూ, నేనూ Cabinet లో ఉన్నాము. ఆ తరువాత కూడా వారు దీనిని గురించి ఏమీ చర్య తీసుకోలేదు. Assignment Policy గురించి రామ స్వామి రెడ్డిగారి ప్రభుత్వకాలంనుంచి సంజీవరెడ్డిగారి ప్రభుత్వం వచ్చే వరకూ ఉన్న విషయాలు చెప్పారు కాని, encroachment విషయంలో వారు అధికారంలో ఉన్నప్పుడెపుడూ కూడా చర్చలోకి తీసుకురాలేదు. ఈ వేళ సందు దొరికింది కదా యని ఏదో చెబితే ఏమి లాభం? వైష్ణవ ప్రతిపత్తి ప్రకారం పైనుంచి క్రిందికి దిగినట్లుగా పేదవారంటే మాకంటే ఎక్కువ ప్రేమ వారికి లేదు. నాకు తక్కువ

లేదు. ఇప్పటికీ నేనొక్క విషయం ఘంటాపథంగా చెబుతున్నాను. నాకు పేద వారి మీద ఉన్న ప్రేమ, హరిజనులకు సేవ చేయాలనే ఆసక్తి ఈ వేళ మాట్లాడిన వారిలో, విమర్శచేసిన వారిలో ఒక్కరికి కూడా లేదు" అని సభ ముందర నొక్కి చెబుతున్నాను. నా జీవితమంతా నాజాతికోసమే ఖర్చుఅయినది. నేను రాజకీయాలలోనికి వచ్చేసరికి పుట్టనివారు కూడా నేడువచ్చి పేదవారి మీద ప్రేమ, భాగ్యవంతుల మీద ప్రేమ అని కబుర్లు చెప్పడం మాస్తే నాకు చాలా కష్టంగా తోస్తున్నది. ఈ పరిస్థితిని ఏమనాలో...అమర్యాద పదాలు ఉపయోగించడానికి నామనస్సు ఇష్టపడక ఊరుకొంటున్నాను. ఈ విషయం అందరూ గుర్తు పెట్టు కోవాలి. మనందరి చరిత్రలూ...ఒకరి చరిత్రలు మరొకరికి తెలుసు. కళా వెంకట రావుగారి చరిత్ర, మిగిన వారి చరిత్రలు కూడా ప్రపంచానికి బాగా తెలుసు. పేదవారి విషయమై, హరిజనుల విషయమై వచ్చే శిఫార్సులన్నీ నా రికార్డులో ఉన్నాయి. స్వీయ చరిత్ర వ్రాసినప్పుడో, లేక ఎప్పుడైనా అవకాశం చిక్కి నప్పుడో సభ ముందర తెలియచేయడానికి నేను సిద్ధంగా ఉన్నాను. మాట్లాడే వారు కొంచెం ఆలోచించి పరిమితిలో మాట్లాడితే బాగుంటుంది. ఈ విషయం దేనికి సంబంధించినది, ఏమి మాట్లాడాలి అనేది ఆలోచించుకోవాలి. నేను ఎక్కు వగా మాట్లాడదలచు కోలేదు. దీనికి సంబంధించి ఒక్క ముఖ్యమైన విషయం ఉన్నది. అనుమతి లేకుండా ఉన్న ప్రభుత్వ భూములను సక్రమం చేయాలి. ఇది తప్ప నా కోరిక వేరే ఏమీ లేదు. దొరికినటువంటి భూమిని—అది పుంతో, గట్టో, పోరంబోకో, గైరానో ఏమైనప్పటికి యివ్వవలసిన న్యాయంఉంది. ఇచ్చే ఏర్పాట్లు చేస్తున్నాం. "ఆంధ్ర ప్రభుత్వంలో కళ్లుమూసుకొనిపోయి తీర్మానం చేశా" రని మాట్లాడేరు. ఆ తీర్మానంప్రకారం మూడు లక్షల 50 వేల ఎకరాల భూమికి అసైన్‌మెంటు యిచ్చాం. ఒక ఎకరం, రెండెకరాలు కాదు. దానికి సంబంధించిన అక్కౌంటు ఉంది. ఏ ఊళ్లల్లో యిచ్చామో చెప్పగలను. అందుచే ఊరికే విమర్శించ డంవల్ల లాభంలేదు. నేను మనవిచేసేది ఏమిటి అంటె అధికారంలేకుండా తన వశము. చేసుకొనేటటువంటి పరిస్థితిని ప్రభుత్వం ఎన్నటికీ ఒప్పుకోదు. ఆ విధంగా రాజ్యాన్ని నడిపించలేము. చారిత్రాత్మకమైన పరిస్థితులలో, గ్రోమోర్ ఫుడ్ కెంపెయిన్ రోజులలో ఎవరికి అందిన భూమిని వారు ఊడ్చుకోవచ్చు అన్నారు 1942-43 ప్రాంతాలలో. కాని 1948 లో ఎలక్షన్ ఆర్డరు యిచ్చారు. అది జ్ఞాపకం ఉంచుకోవాలి. అందు

వల్ల ఏదిచేసినా సక్రమంగా చేయాలి. ఈవేళ మనదగ్గర అందుబాటులో ఉన్నటువంటి, వ్యవసాయానికి యోగ్యమైనటువంటి భూమిని బీదవారికి తప్ప యింకెవరికీ యివ్వకూడదు. అటువంటి భూమిని యివ్వడానికి ప్రభుత్వం సిద్ధంగాఉంది. భాగ్యవంతుడిమీద పన్నులు వేయడంలేదని అంటున్నారు. గంజి నాగేశ్వరావుగారి గొంతుక హాలు, హాలుఅంతా ప్రతిధ్వనించింది. కాని 800 ఎకరాలు ఉన్న భూస్వామి, 650 ఎకరాల భూమిని ఆక్రమించుకొంటే, ఈ మాట అప్పుడు మాట్లాడలేదు. ఈ అసెంబ్లీలో మాట్లాడలేదు. ఎక్కడో నరేంద్రపురంలో 3½ ఎకరాల పుంత ఆయనకు జ్ఞప్తికి వచ్చింది. ఈనాడు యకరానికి 10 బస్తాలు పండే బంజరుభూములు ఆక్రమణలో ఉన్నాయి. దానిగురించి జ్ఞప్తికిరాదా ?

శ్రీ జి నాగేశ్వరరావు : ఆ పేరు ఏమిటో కొంచం సెలవిస్తారా ?

శ్రీ కె. వెంకటరావు : పేర్లు చెప్పి యిక్కడ వాగ్వివాదాలకు దిగతలచుకోలేదు. ఆయనకు తెలుసు, నాకు తెలుసు.

శ్రీ జి. నాగేశ్వరరావు : నాకు తెలియదండి.

శ్రీ కె. వెంకటరావు : వారికి పూర్తిగాతెలుసు దానిని గురించి అడగడం అనవసరం.

శ్రీ జి. నాగేశ్వరరావు : అధ్యక్షా ! అది కొంచము చెబితే బాగుంటుంది.

మిస్టర్ స్పీకర్ : వారుచెప్పడం పూర్తిఅయినతరువాత పర్మిషన్ యిస్తాను.

శ్రీ కె. వెంకటరావు : ఈ చట్టం పెడుతున్నాం అంటే ½ ఎకరం ఆక్రమణ చేసుకొన్నవారికి, వందలు ఎకరాలు ఆక్రమణచేసుకొన్న వారికికూడ వర్తింపచెయ్యాలి. 850 ఎకరాలు స్వంతభూమి ఉండి, 650 ఎకరాలు ఆక్రమణ చేసుకొని మూడు కోర్టులు తిరిగి ఆఖరుకు హైకోర్టులోఉన్న రెండు రిట్లు డిస్‌మిస్ చేసినప్పటికికూడ రాజోలు మునసబుకోర్టులో దావా చేసినటువంటి విషయం నాగేశ్వర్రావుగారికి తెలియదంటె నేను ఎలా నమ్ముతాను. ఆయనకు తెలుసు. నాచేత చెప్పించాలని ఆయన ఉద్దేశ్యం తప్ప అంతకంటె ఏమీలేదు. అందువల్ల నేను మనవి చేసేది అందరిమీద ఈ చట్టం ప్రయోగించాలి. కాబట్టి **unauthorised** గా వెళ్లకండి. **authorised** గా మీ ఇష్టంవచ్చినట్లు చెయ్యండి. రెవిన్యూ మంత్రిగా 'బారాహుకుం' యివ్వడానికి సిద్ధంగా ఉన్నాను, ప్రోపర్ అసైన్‌మెంటు తీసుకోండి.

ఈ చర్చలోకి, కొన్ని అంతర్గతమై ఉన్న విషయాలు తీసుకొనివచ్చారు.

ఈ రోజున తెలంగాణా, ఆంధ్ర చట్టాలలో పెద్దతేడా ఏమీలేదు. ఎల్లారెడ్డిగారు అరెస్టు గురించి చాలాసేపు మాట్లాడేరు 157 వ సెక్షన్ చూచినట్లయితే 'can be arrested and tried in a criminal way' అని తెలంగాణా శాసనంలో కూడ ఉంది. అయితే అది ఎప్పుడూ అమలులోకి రాలేదు. నేను విన్నంతవరకు బేదఖల్ కోసము అరెస్టు చేసినట్లు నాదృష్టిలో లేదు. రికార్డులోకూడ ఎక్కడా కనిపించదు. ఇటువంటి సందర్భాలు తెలంగాణాలో కూడ లేవనే నా ఉద్దేశ్యం. ఒక విషయంలోమాత్రం కొద్దిగా మార్పుఉంది. పదిరెట్లు అనేది తెలంగాణాలోనూ, ఆంధ్రాలోకూడ ఉంది. ఆంధ్రలో 20 రెట్లు ఎందుకు ఉన్నదంటే unassessed lands, అసలు సర్వే ఏమీలేకుండా పెట్టుకొన్నట్లయితే దానికోసమని 20 రెట్లు ఉంచారు. మిగిలిన విషయాలలో ఏమీ తేడాలు లేవు. హైదరాబాదుమీద క్రొత్తగా రుద్దుతున్నవి ఏమీ లేవనిమాత్రం మనవిచేస్తున్నాను. ఈ విమర్శలు చేసినవారు, ఏదో మనసులో బాధపెట్టుకొని చేసినట్లు కనపడుతోంది. గైరాన్లు గుట్టలగురించి సర్క్యులర్సు ఉన్నాయి. అవి అన్నీ అమలులో పెట్టాము. 1954 లో తయారైన సర్క్యులర్‌ను అమెండు చేయకుండా అమలులో పెట్టడానికి మూడు సార్లు ఉత్తర్వు వేశాము. ఎక్కువగా జిరాయితీలు వేస్తూంటే ఆపుతూనే ఉన్నాం. అసైన్‌మెంటు రూల్సును, ఈ చట్టంలోకి తీసుకొనివచ్చి చర్చించడం అంత భావ్యం కాదు. ఈ చట్టంతో దానికి సంబంధం లేదు. లావునీ భూములకు సంబంధించిన రూల్సును ఒక్క దానినికూడ disturb చేయదలచుకోలేదు. ఆ భూములగురించి హైదరాబాదు ప్రభుత్వం యిచ్చిన సర్క్యులర్స్‌కు వ్యతిరేకంగా ఒక్క అంగుళం కూడ వెళ్లదలచుకోలేదు అంతేకాకుండా యింకా ఎక్కువ మందికి యివ్వడానికి పరిశీలిస్తాను. లంకల గురించి చెప్పారు. లంకలు ఇవాళ పుడతాయి, రేపు పోతాయి. అయినప్పటికి సొసైటీస్‌కు యిస్తూనే ఉన్నాం. ఈ సంవత్సరం లంకల విషయమై యింకో ఆర్డరు వేశాను. 4 జిల్లా కలెక్టర్లు లిస్టు ఫైనలైజు చేసి మొత్తం లిస్టును యిక్కడకు పట్టుకువచ్చి ప్రభుత్వ అనుమతిని పుచ్చుకోవాలని ఆర్డరు వేశాము. ఈ రోజున unauthorised గా లంకలను ఆక్రమణ చేసుకొన్నవారికి 11/- రూ. లు పన్నుఉంటే ప్రభుత్వందగ్గర పెర్మిషన్ తీసుకొని, సొసైటీల పరంగా ఉన్నవారికి, లేదా వేలంపాటలో పుచ్చుకొన్నవారికి 200-రూ. లు పన్ను ఉంటున్నది. దీనిని సరిజేయమనే, నేను చెప్పాను. Unauthorised వాళ్లకు advantage గా ఉన్నది. Authorised వాళ్లకు ఎలాగ ఉన్నదో మీ దృష్టికి తీసుకొని వచ్చాను. అంతకంటె ఏమీలేదు. ఇప్పుడు మనం ఈ బిల్లును సెలక్టు కమిటీకి పంపడానికి అంగీకరించాము గనుక ఇక మొదట రీడింగ్ యింతటితో ముగిద్దాము.

*Mr. Speaker :* The question is :

"That the Madras Land Encroachment (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958, be read a first time."

The motion was adopted.

*Sri K. Venkata Rao*: I beg to move:

"That the Madras Land Encroachment (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958, be referred to a Select Committee consisting of:

1. Sri Kala Venkata Rao, Minister for Revenue.
2. ,, P. V. Rajeswara Rao
3. ,, K. S. Narayana
4. ,, Dawar Hussain
5. Srimati Kanakaratnamma
6. Sri M. Rajaram
7. ,, Meduri Nageswara Rao
8. ,, H. Ramalinga Reddi
9. ,, D. Perumallu
10. ,, P. Venkataswamy Reddy
11. ,, S. K. V. Krishnavatharam
12. ,, Baddam Yella Reddi
13. ,, S. Vemayya
14. ,, G. Yellamanda Reddi
15. ,, K. Rajamallu
16. ,, Basava Manaiah
17. ,, G. Narasimhamurthi
18. ,, Marupilli Chitti."

*Mr. Speaker*: The question is:

"That the Madras Land Encroachment (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958, be referred to a Select Committee consisting of

1. Sri Kala Venkata Rao, Minister for Revenue.
2. ,, P. V. Rajeswara Rao
3. ,, K. S. Narayana
4. ,, Dawar Hussain

5. Srimati Kanakaratnamma
6. Sri M. Rajaram
7. ,, Meduri Nageswara Rao
8. ,, H. Ramalinga Reddi
9. ,, D. Perumallu
10. ,, P. Venkataswamy Reddy
11. ,, S. K. V. Krishnmurthi
12. ,, Baddam Yella Reddi
13. ,, Swarna Vemayya
14. ,, G. Yellamanda Reddi
15. ,, K. Rajamallu
16. ,, Basava Maniaiah
17. ,, G. Narasimhamurthi
18. ,, Marupilli Chitti.

The motion was adopted.

మిస్టర్ స్పీకర్ : Joint Committee అక్కరలేదా ?

శ్రీ కె. వెంకటరావు : అక్కర లేదు. ఆ బిల్లును తరువాత ఎప్పుడో introduce చేస్తాను.

* శ్రీ పి. సుందరయ్య : అధ్యక్షా ! Point of Submission, Sir, దీని మీద మీ యొక్క అభిప్రాయం కావాలి. ఇప్పుడు అమెండుమెంటు బిల్లు క్రింద తెచ్చిన క్లాజులకే గాక, అసలు ప్రిన్సిపల్ ఆక్టుకు కూడ సవరణలు సభ్యులు యివ్వడం జరిగింది. ఈ బిల్లును సెలక్టు కమిటీకి పంపించినప్పుడు మిగతా ఆక్టుకు సంబంధించిన సెక్షన్లకు కూడ సెలక్టు కమిటీలో అమెండుమెంట్సు తెచ్చే దానికి, దాని మీద చర్చలు కొనసాగించడానికి అవకాశం ఉండేలాగ రూలింగు యివ్వాలని కోరుతున్నాను. లేకపోయినట్లయితే అమెండుమెంటు పెట్టిన 3, 4 క్లాజుల బిల్లునే పంపి, దాని మీద చర్చలు సాగించాలంటే దానివల్ల పూర్తి ఉపయోగం ఉండదు. కొద్ది ఉపయోగమే ఉంటుంది. అందుచేత ప్రిన్సిపల్ ఆక్టు మీద కూడ సెలక్టు కమిటీలో సవరణలు తీసుకొనిరావడానికి వీలుండేలాగ మీ రూలింగు కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్ : ముందు సెలక్టు కమిటీకి పంపడానికి ఆ పేర్లు యిష్టమే కదా! ఇష్టం అయినప్పుడు రెవిన్యూ మంత్రిగారిని చైర్‌మన్‌గా అపాయింటు

చేస్తున్నాను. ఇక, సెలక్టు కమిటి ఏమేమి విచారించాలి అన్న దానిని గురించి కదా !

శ్రీ పి. సుందరయ్య : ఇప్పుడు మనం ఈబిల్లును సెలక్టు కమిటికి పంపిస్తున్నాము. ఇప్పుడు ఏక్లాజులకైతే సవరణలు వచ్చాయో వాటిని సెలక్టు కమిటీలో చర్చించవచ్చు. అంతే గాకుండా యింకా సెలక్టు కమిటీకి వచ్చేటటువంటి సవరణలు, ఇంకా సవరణలు పంపనటువంటి సభ్యులు పంపే సవరణలు సెలక్టు కమిటీలో చర్చిండానికి వీలుండాలి. ఎందుచేతనంటే ప్రిన్సిపల్ ఆక్టుకు కూడ సవరణలు వచ్చాయి కాబట్టి, అన్ని క్లాజులను చర్చించే అవకాశం కల్పించాలి. అలా చేయడం న్యాయమైన పద్ధతి కూడ. ఈ బిల్లు ఈరోజుననే తీసుకొని consideration stage వచ్చినట్లయితే, మేము Point of Orders raise చేయాలని కూడ అనుకున్నాం. ఎందుచేతనంటే ఒక ప్రాంతానికి సంబంధించి ఒక ఆక్టు ఉండి, ఆ ఆక్టులో ఆ ప్రాంతానికి సంబంధించి ప్రభుత్వం కొన్ని సవరణలు చేస్తే, ఏ 2, 3, 4, క్లాజులకో సవరణలు పెట్టి ఉన్నట్లయితే, ఆ రెండు మూడు క్లాజులకే సవరణలు ప్రతిపాదించడానికి, చర్చించడానికి వీలు ఉండేది. మిగిలిన క్లాజులను సెలక్టు కమిటీకి పంపకూడదని ఇదివరకటి రూలింగు, సాంప్రదాయం కూడ. కాని ప్రస్తుతం ఈ బిల్లు, Extension బిల్లు, Integration బిల్లు, అన్నీ కేవలం ఆంధ్ర ప్రాంతానికి సంబంధించినంతవరకే సవరించడంలేదు. Extension, Integration లేకుండా కేవలం ఆంధ్ర ప్రాంతానికే ఈ సవరణలు ఉన్నట్లయితే, ఏ రెండు క్లాజులకో సవరణలు తెచ్చినట్లయితే, మిగితా బిల్లును, మిగిలిన క్లాజులు touch చేయకూడదని పార్లమెంటరీ సాంప్రదాయం. ఈ సందర్భంలో ఒక విషయం మీ దృష్టికి తీసుకొని వస్తున్నాను. మొన్న వారంరోజుల క్రితం రూల్సు చర్చిస్తున్నప్పుడు మంత్రివర్గం ఆ రూల్సులో 3, 4, 5 వాటికి సవరణలు పెడితే, మా పార్టీ తరఫున మిగిలిన రూల్సుకు కూడ సవరణలు పెట్టారు. ఆ సవరణలపై Leader of the Opposition అయిన నా అభిప్రాయం మీరు అడిగారు. ఆరూల్సు మొత్తం ఆంధ్ర ప్రదేశ్‌కు సంబంధించినవి కాబట్టి, పార్లమెంటరీ సాంప్రదాయం ప్రకారం, ప్రభుత్వం యేవో 2, 3 క్లాజుల వరకే, సవరణలు ప్రతిపాదించుటకు పూనుకొన్నది కాబట్టి, మిగిలిన క్లాజులకు సవరణలు ప్రతిపాదించుటకు మాకు వీలు లేదని, ఆ విధంగా ప్రతిపాదించడం పార్లమెంటరీ సాంప్రదాయం కాదని నేను చెప్పాను. లేకపోతే Non-official motion తెచ్చి మిగిలిన క్లాజులకు అమెండు మెంట్సు పెట్టుకోవచ్చునని, ప్రభుత్వ సవరణలు ప్రవేశపెట్టారు. కాబట్టి మేము కూడ మిగిలిన క్లాజులకు సవరణలు ప్రవేశ పెడతాము అన్నది న్యాయం కాదని, పార్లమెంటరీ సాంప్రదాయం మీ యెదుట పెట్టాను.

అయితే దానికి దీనికి భేదం ఉన్నది. ఇదివరకు ఈ Act మొత్తం ఆంధ్ర ప్రాంతానికి మాత్రమే సంబంధించినది. దానిలోని కొన్ని క్లాజులలో మంత్రి వర్గం తమ చిత్త ప్రకారం కొద్ది మార్పుచేసి తెలంగాణ ప్రాంతానికి వర్తింపచేస్తు న్నారు. ఇందువల్ల తెలంగాణలో అమలులో ఉన్న చట్టాలన్నీ రద్దయిపోతున్నవి. తెలంగాణకు వర్తింపచేయు చట్టాలలోని క్లాజు అది ఏ రీతిగా affect ఔతున్నదో చూడాలి. ఇదివరకు వారికి ఉన్న చట్టాలలోని రూల్సునుబట్టి వీటితో మార్పులు చేయవలసి ఉంటుంది ఇక్కడ ఇన్న పరిస్థితులను బట్టి ఎలాంటి నష్టంలేకుండ అభివృద్ధి పొందుటకు, అవసరమైతే మార్పులు చేసుకొనుటకు అవకాశం ఉండు నట్లు చేయాలి. Integration అర్థం కూడ అదే ఔతుంది. కాబట్టి నా technical and legal Point ఏమిటన, extension అన్నప్పుడు కొత్త ప్రాంతానికి, దాదాపు మూడవ వంతు ప్రాంతానికి అక్కడ అమలు యందున్న laws అన్నిం టిని రద్దుచేసి కొత్త laws వర్తింపచేయడం జరుగుతున్నది. కాన అది ఆప్రాంతా నికి సంబంధించినంత వరకు main Act ఔతుంది ......

మిస్టర్ స్పీకర్ : Section after section వర్తింప చేస్తున్నారు. కాన ప్రతి section కు అమెండ్మెంటు ఇచ్చుటకు, ఆలోచించుటకు అధికారమున్నదని మీ వాదన.

శ్రీ పి. సుందరయ్య : అది Technical, Legal, Constitutional and Parliamentary point తరువాత, Moral and Political point ఏమిటనగా...

మిస్టర్ స్పీకర్ : నాకు Constitutional points తప్ప moral, immoral విషయం అక్కర లేదు. Constitution ప్రకారం అది తప్పా, ఒప్పా, అనే విష యమే మనకు కావాలి. నేను law కు విరుద్ధంగా రూలింగు ఇవ్వలేను కదా! కాబట్టి law ఉన్నదో అది ఎవరికి వ్యతిరేకమౌతుందో నేను చెప్పలేను. మీ ఇద్దరి వాదన విన్న తరువాత నాకు తోచింది చెప్పుతాను. ఇప్పుడు ఒక క్రొత్త చట్టమును అందులోని మొదటి సెక్షన్ నుండి చివరి సెక్షన్ వరకు తెలంగాణ ప్రాంతానికి వర్తింప చేస్తున్నారు. వారు కొన్ని సెక్షన్సును మాత్రం amend చేస్తూ "that act applies" అని అన్నారు. కాని ఇప్పుడు ఆ సవ రించబడిన సెక్షన్సు వరకే ఆలోచించాలా, లేక అన్ని సెక్షన్సును విచారించుటకు, వాటికి amendments ఇచ్చుటకు సభకు, సభ్యులకు హక్కు ఉన్నదా? అనే విషయాన్ని తేల్చుకోవాలి. ఆ విధంగా ఇచ్చువారు ఏపార్టీవారు అనే విషయం నాకు సంబంధం లేదు.

శ్రీ పి. సుందరయ్య : కాంగ్రెస్ పార్టీవారు కూడ అమెండ్‌మెంట్సు ఇవ్వవచ్చునండి.

మిస్టర్ స్పీకర్ : ఎవరైనా ఇవ్వవచ్చును. వాటిని సెలెక్టు కమిటిలో ఆలోచించవచ్చును, ఇది చాలా important question. కనుక మీరు ఏమైనా చెప్పవలసింది ఉన్న చెప్పండి. నాకు ఇంతవరకు దానిమీద ఏ అభిప్రాయమూ లేదు.

శ్రీ పి. సుందరయ్య : పార్లమెంటరీ సాంప్రదాయం వేరు. ఈ సాంప్రదాయం వేరు.

మిస్టర్ స్పీకర్ : పార్లమెంటులో సాంప్రదాయం ఎలా ఉన్నది?

శ్రీ పి. సుందరయ్య : పార్లమెంటులో ఈ విధంగా integration, extension అనే సందర్భం రాలేదండి.

మిస్టర్ స్పీకర్ : కాశ్మీరుకు extension అని ఎప్పుడైనా, వచ్చిందా?

శ్రీ పి. సుందరయ్య : కాశ్మీరుకు చట్టములను extend చేయుటకు Constitution లోని 370 B సెక్షను మార్పుచేయవలసి ఉంటుంది.

మిస్టర్ స్పీకర్ : ఏ స్టేటుకైనా extend చేయవచ్చునని గజెట్‌లోనే ఉంటుంది. ఇది అలాంటిది కాదు. క్రొత్తగా తీసుకొని వస్తున్నారు.

శ్రీ పి. సుందరయ్య : దానికి సమస్యే లేదు. కాని ఈ బిల్లును మనము పాస్‌చేయని యెడల తెలంగాణకు అసలు వర్తించదు. They cannot do it by executive order. అందుచేత ఈ బిల్లులోని ప్రతి సెక్షను గూడ చర్చించుటకు మనకు హక్కు ఉండాలి. లేని ఎడల అసెంబ్లీలో బిల్లును ప్రవేశపెట్టి ప్రయోజనం లేదు. లేకపోతే ప్రభుత్వానికి సర్వాధికారాలు ఇచ్చాము అని ఒక బిల్లును పాస్‌చేసుకోవచ్చును. అప్పుడు అసెంబ్లీ దగ్గరకు రాకుండ చట్టాలను వారి యిష్టం వచ్చినట్లు సవరించుకొని తెలంగాణకు వర్తింప చేయవచ్చును. కాని అలాంటిదేమీ లేదనుకోండి ఇప్పుడు. అది లేనంత కాలం ప్రవేశపెట్టి బిల్లులోని అన్ని సెక్షన్సును చర్చించుటకు అవకాశం అవసరం ఉన్నది.

* శ్రీ వి. శ్రీరామమూర్తి : (విజయనగరం) ఇది కేవలం extension మాత్రమే కాదు. తెలంగాణలో అమలులో ఉన్న చట్టాలను repeal చేయుట కూడ జరుగుతున్నది. తెలంగాణలో కొన్ని మాసాల తరబడి సంపూర్ణంగా పరిశోధనచేసి చేసిన చట్టాలనన్నింటిని ఒక వాక్యంతో రద్దు పరచడం సబబా! కాదా!

అనే విషయం కూడ ఇందులో involve అయి ఉన్నది. ఒక చట్టాన్ని రద్దు చేయడం జరుగుతుంది. ఇంకొక చట్టాని పెట్టడం జరుగుతుంది. ప్రజాస్వామ్య విధానంలో, ప్రతినిధుల ద్వారా ఏర్పడిన అసెంబ్లీలో చేసిన నిర్ణయాన్ని విచారణ చేయకుండా; ఆలోచించుటకు అవకాశమైనా ఇవ్వకుండా రద్దుపరచడం ఎంత మాత్రమూ సరియైన పద్ధతి కాదు. దానిని repeal చేయుటకే అవకాశంలేదు. Repeal చేయుటకు అధికారం లేనంతవరకు దానిని extend చేయుటకు అసలే వీలులేదు. ఇది submission.

* శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : అధ్యక్షా ! దీనిని Adaptation Act క్రింద ఇదివరకే notify చేసి ఉండినచో మనము ఇప్పుడు ఏమీచేయ గలిగి ఉండే వారం కాదు. అలా కాకుండా బిల్లు రూపంలో తెలంగాణకు అనువర్తింప చేయాలని తెస్తున్నారు. దానిలో ప్రభుత్వం కొన్ని క్లాజులను మాత్రమే ముట్టుకొని...

మిస్టర్ స్పీకర్ : క్లాజులు కాదు. సెక్షన్సు అనండి.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : కొన్ని క్లాజులలో ఇరికిస్తున్నారు.

మిష్టర్ స్పీకర్ : వారు ఇరికించలేదు. ఇరికించిన వాటికి చిక్కే లేదు. కాని ఇరికించని వాటిగురించే ఇప్పుడు వచ్చిన ప్రశ్న.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : అందువల్ల ఈ క్లాజులలో ఇరికించిన వాటిని గురించి చర్చించవచ్చు. కాని ఒక బిల్లులోని కొన్ని క్లాజులను ముట్టు కొన్నచో, తక్కినవి కూడ వాటికి సంబంధించే ఉంటవిగాన బిల్లు నంతను చర్చించు టకు అవకాశముండి తీరాలి. కొన్ని సెక్షన్సును మాత్రమే చర్చించి, మిగత వాటిని ముట్టుకొనుటకు వీలులేక పోయినచో integration ను బిల్లు రూపంలో తీసుకరానక్కర లేదు. ఒక సంవత్సరం లోపలనైతే adaptation క్రింద తీసుక రావచ్చు. ఇప్పుడు ఆ stage దాటిపోయింది. బిల్లురూపంలో తెస్తున్నప్పుడు మొదటి ఉన్న act లోని సెక్షన్సు అన్నింటని చర్చిస్తేనే బిల్లుకు సమగ్రమైన రూపం వస్తుంది. పైగా ప్రభుత్వం ఉన్నవాటిని మాత్రమే అమలు జరుపక అదను దొరికింది కదా యని కొన్నిటిని elaborate చేస్తున్నారు. కొన్ని omit చేస్తున్నారు. అవకాశము న్నప్పుడు శాసనసభ adaptation తో పాటు దానిని మార్చుటకు కూడ అవకాశ మున్నదని వారు ఒప్పుకున్నారు. మార్చుటకు అవకాశ మున్నప్పుడు Act మొత్తమును చర్చించే హక్కు వస్తున్నది.

*Mr. Speaker*: The hon. Member is confusing me. ఇందులో adaptation లేదు. They are applying particular Act to another area.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య: Extension కు ఎలా అవకాశం వచ్చిందో అలాగే Act లోని అన్ని క్లాజులను కూడ పరిశీలించవచ్చునని నా Contention—

మిస్టర్ స్పీకర్: క్లాజు 3 క్రింద The Madras Land Encroachment Act, 1905 as in force at the commencement of this Act in the Andhra area... shall be in force in the transferred territories. అన్నపుడు whole Act వర్తిస్తుంది అంటున్నారే. Section by Section చర్చ చేయడానికి అధికారం ఉన్నదా? లేక ఏ క్లాజులకు సవరణలను ఇచ్చారో వాటి నేనా చర్చించేది ?

శ్రీ కె. వెంకటరావు: నాకు తోచిన విషయాలు చెబుతాను. మొదటి విషయం, సెలక్టు కమిటీకి వెడుతున్నది — బిల్లు; ఈ House ముందు introduce చేసిన బిల్లు సెలక్టు కమిటీ consideration కు వెడుతుంది Original Act ఈ House ముందుకు రాలేదు.

What is being referred to the Select Committee is the Bill and not the Act. The Act (Madras Land Encroachment Act) is already law, save we do not introduce any amendments. Nobody has a right to move an amendment to that Act now, except by an amendment moved by the Government or a private Bill given notice of by one of the members. Because the Government is now exercising its right to introduce an amendment to a sections of that particular Act, it is not just that all the Sections of that Act should be brought under consideration, particularly when the legislation before the House is only a Bill seeking with limited purpose and not with overall purpose of consideration of amendment of any kind of Act. It is within the privilege of this Government under the constitution to introduce any legislation: this legislation may be a new Act or it may be an amendment to an old Act. What is now sought to be done is to repeal one of the Acts which is having jurisdiction here and to introduce another Act which is necessary, in the opinion of the Government. It is neces-

sary to secure the opinion of the House and make the Bill into law.

*Mr. Speaker*: But so far as Telangana is concerned, it is a new Act that the Govenrment are seeking to apply. If that Act is already in operation here in the Telangana region, the question of bringing amendments to that Act arises. But when we seek to apply a new Act altogether to this region, how does the question of amendment arise?

*Sri K. Venkata Rao* : The point before the House is this : there is nothing called Telangana or Andhra, so far as this Bill is concerned. What is here is, only the State of Andhra Pradesh. Anything done is done only in the name of Andhra Pradesh, so as to affect the territory of the State of Andhra Pradesh. Because there were different sets of statutes in the two regions comprising the Andhra Pradesh State, the States Re-Organization Act had taken a particular view, and has authorised this Government to act in a particular manner. That right has been given under the Constitution, and in this regard, there is no particular protections afforded to Telangana.

*Mr. Speaker* : The Regional Committee is there.

*Sri K. Venkata Rao* : The Regional Ccmmitte has only certain powers, and if this Bill falls within the purview of the Regional Committee, I have no objection and I will certainly consult them.

*Mr. Speaker*: The hon. Minister states that there is no Telangana. But there is already mention of Telangana.

*Sri K. Venkata Rao*: That Telangana is with a very particular and limited purpose. The constitution and presence of the Regional Committee is only with a limited purpose under the Constitution. It cannot extend its jurisdiction to every other question not falling within its purview. Hence, there is no need for the President's Order.

My second point is this: Today or tomorrow I am to introduce another Bill by way of amendment to the Land Acquisition Act. That Act is a Central Act. Under certain powers given to us, we only amend it to the extent necessary. If every clause of it is to be touched, it is not a Provincial legislation—it is an All India Legislation—and so, that cannot be done. The question is, should our Select Committee have the authority to amend the sections of the Central Act, which has been on the Statute Book from 1894 onwards. Should there be no distinction drawn between a Central Act and the Provincial Act?

*Sri P. Sundarayya*: But the Government is already amending it.

*Sri K. Venkata Rao*: But it is only with a limited power we are doing it. I cannot replace that Act; I cannot amend the whole Act. Because that Act has not been originally applied to Part B States, we are seeking to apply it now. Nothing more than that, so far that aspect is concerned.

*Mr. Speaker*: But how are you touching it? Because it has come within your jurisdiction.

*Sri K. Venkata Rao*: Yes, Sir.

*Mr. Speaker*: So, it is your Act.

*Sri K. Venkata Rao*: No. Today, I am not entitled to legislate, under the concurrent list, entirely for that Act. With only a limited purpose, we are seeking to amend that Act, and we have taken the permission of the President to introduce the Bill. It is a concurrent subject; and this Government cannot suo moto do anything. I am acting only under authority and that authority will not spread to every other aspect.

My third submission to you, Sir, is this: After all, we have to integrate the laws. If the procedure suggested by

the hon. Leader of the Opposition is accepted, this integration will become very difficult. It is for a limited purpose that the present Bill has been brought before the House. A stage will come, as I submitted to the House yesterday, when the whole of the integrated laws under various aspects have to be brought in the Statute Book in a different manner by introducing a new legislation. That stage will come in furture. Now, it is only by way of administrative convenience that this Bill has been brought forward, for, two laws cannot function in the same area, with different sets of regulations. Therefore, the limited purpose ...

*Mr. Speaker*: With regard to integration, you may combine both the provisions of both the areas and bring in a new Act. Then it will be gone into clause by clause.

*Sri K. Venkata Rao*: I agree entirely. There is no objection. I submit it is not just also that we should object at that stage. Every clause should be touched and recast and introduced to the best advantage, according to the opinion of the Assembly.

*Mr. Speaker*: What is the difference now? Instead of bringing in a new Act, you are extending an old Act to the Telangana region.

*Sri K. Venkata Rao*: The difference is that we have taken some good aspects of the existing Acts here and there, combined them and introduced them here. We did like that in the case of many other things. Till now, we have so many Acts done like that. Suppose, I do not agree for a Select Committee. The whole thing will go. Only the amendments that are proposed before the House now will come up for consideration, and not all the Sections of the original Act. You, Sir, have already ruled that other sections cannot be touched.

*Mr. Speaker*: But you have already touched some new sections. Here is an amendment: "Add the following as a new Clause, Clause 7".

*Sri K. Venkata Rao*: Let them amend, Sir, I have no objection. To that extent, I am free. Let them amend clause 5 which refers to Section 3. That can be done, I have no objection. But my point is, where there are, say, 16 sections and Government moved amendments to only four of them, the House cannot discuss the other provisions of the Act, not falling within the purview of the amending Bill.

మిస్టర్ స్పీకర్ : ఇచ్చిన సవరణలలో చాలా భాగం వీటిక్రింద కే వస్తాయి. Delete clause 5 అనే సవరణ, delete sub-clause 2 of clause 5 అనే సవరణ ఇందులోనికి వచ్చేవే, వీటి క్రిందకురాని సవరణలను ఎట్లా గీసుకురావా అనేది ప్రశ్న. బద్దం ఎల్లారెడ్డిగారు సెక్షన్ 5 కు ఇచ్చిన సవరణ ఒక్కటే క్రొత్తది. Spirit కు సవరణ కాకపోవచ్చును. Technical గా సవరణ, how can they touch it ?

*Sri K. Venkata Rao:* Clause 7 is new, but Section 5 is not new. We are not amending Section 5. Government are not touching Section 5 of the Act.

*Mr. Speaker:* There is an amendment in the name of Sri Baddam Yella Reddy to add the following as new Clause 7:

"7. Amendment of Section 5, Madras Act III of 1905:

(i) in sub-section (1) for the words 'ten times' in both the places where they occur, substitute the words 'five times'."

(ii) in sub-section (2) for the words 'twenty times', in both the places where they occur, substitute the words 'ten times'."

Then we have Section 6.

Technically this is an amendment to Section 5, not touched by the Bill.

*Sri K. Venkata Rao*; That is my submission, Sir.

శ్రీ పి. సుందరయ్య : 6 వ సెక్షనుకు కూడ సవరణలు వున్నాయి.

మిస్టర్ స్పీకర్ : Section 6 ను clause 7 లో touch చేస్తున్నారు.

శ్రీ కె. వెంకటరావు : వారిచ్చిన సవరణలలో చాలమట్టుకు out of order.

మిస్టర్ స్పీకర్ : Clause 7 కు మీరిచ్చిన సవరణలన్నీ section 6 చుట్టూ తిరుగుతున్నాయి. దానికి నేను యేమీ చేయడానికిలేదు. నేను Ruling యిచ్చి Select Committee కి పంపించాలి. ఊరికే as it is పంపించినా The section which is not touched is already attempted to be amended by them

శ్రీ కె. వెంకటరావు : వారిచ్చిన సవరణలను merits మీద consider చేస్తాము. If they are ultra vires, we will tell them so......

మిస్టర్ స్పీకర్ : Out of order అని ఎవరు అంటారు ?

శ్రీ కె. వెంకటరావు : సెలెక్టు కమిటీలో ఎవరుంటేవారు ?

మిస్టర్ స్పీకర్ : సెలెక్టు కమిటీలో in order అంటే.

శ్రీ కె. వెంకటరావు : అప్పుడు మళ్లా తమ దగ్గరకే వస్తాముకదా ?

మిస్టర్ స్పీకర్ : In order or out of order అనేది సెలెక్టు కమిటీవారే చూసుకోవడం ఒక పద్ధతి.

శ్రీ పి. సుందరయ్య : అధ్యక్షా ! అది ఎక్కడా procedure కాదు. Point of Order మీద Speaker is the final authority. సెలెక్టు కమిటీలో మెజారిటీ ప్రభుత్వమే. Whereas you are not expected to be on the side of the majority. That is why the right of the Assembly is in your hands. The rules of procedure are in your hands. అక్కడ శ్రీ కళా వెంకటరావుగారే Chairman. అక్కడ point of order raise చేస్తే ఆయనే Ruling యిస్తారు.

*Sri K. Venkata Rao* : The Chairman is above parties.

*Sri P. Sundarayya:* The Speaker is above parties and not the Chairman of a Select Committee.

*Mr. Speaker*: So, I have to decide now. It is a very doubtful point. I shall carefully consider and give my decision tomorrow. రేపు మళ్లా ఉదయం 8-30 గంటలకు సమావేశమవుతాము.

*The House then adjourned till Half Past Eight of the Clock on Tuesday, the 8th July 1958.*